# జీవిత ధర్మం



సంకలనం
కళాప్రపూర్ణ
పాతూరి నాగభూషణం

సర్వోత్తమ ప్రచురణలు
విజయవాడ-6

## అంకితము

సత్కార్యాచరణము, పరోపకార పారీణత, భక్తితత్ప
రతలతో జీవితమును గడపిన సాధుశీలి.

**కీ. శే. పుతుంబాక శ్రీకృష్ణయ్య గారికి**

# నివేదన

వివిధ విషయాలపై గల మహనీయుల ప్రవచనములను ఎన్నో సంవత్సరాలుగ సేకరించుచు వచ్చినాను. వీనిలో కొన్నింటిని గ్రంథాలయ సర్వస్వములో అప్పుడప్పుడు ప్రచురించినాను. ఇందులో మానవుడు, జీవితం, ధర్మం, ప్రేమలకు సంబంధించిన అంశములపై గల రచనలను వరుసగా చేర్చినాను.

ప్రేమయే జీవితసారం, పరమార్థం అన్న రష్యన్‌కవి, భౌతికవాదియైన గ్లెబ్ వగిరెవ్, ప్రవచనము "ఈ జీవితమున ఎట్లయినను, ఎన్ని కష్ట నష్టములు పడియైనను పొందవలసినది, దక్కించుకొనవలసినది, ఉన్నతికి మూలమైనది ప్రేమ ఒక్కటే" అన్న విషయము; ఆధ్యాత్మిక వేత్త, జగదాచార్యుడు నైన స్వామి వివేకానందుని సందేశము ఏకగ్రీవముగా 'జీవిత ధర్మం ప్రేమయే' యని చాటుచున్నవి. ఈ విషయమై విశ్వ వ్యాప్తంగా గల మహనీయులందరూ ఏకాభిప్రాయులుగా నున్నారు. విశ్వజనీనమైన యీ సందేశాన్ని యీ గ్రంథంలోని సూక్తులు ఉత్తేజకరంగా, ఆకర్షణీయమైన రీతులలో మన కందించుచున్నవి. కనుక యివి మనకు మార్గదర్శకములుగ నుండగలవను తలంపుతో ఈ పుస్తకాన్ని కూర్చినాను.

ఈ సంకలనములో కొన్నింటిని ఆయా గ్రంథములనుండి యథాతథముగ ఎత్తివ్రాసినాను. ఆంగ్లంలో గల రచనలను అనువాదం చేసి చేర్చినాను. మహోన్నతములైన సూక్తులుగల రచనలను అనువాదం చేసి చేర్చినాను. మహోన్నతములైన సూక్తులు గల యీ పొత్తమును నా గ్రామస్థులు, ఆదర్శ జీవనులు, సత్కార్యములపట్ల అత్యంత ఆసక్తి గలవారు, పరోపకార పారీణులు, భక్తి తత్పరులు నైన కీ. శే. పుతుంబాక శ్రీ కృష్ణయ్య గారికి అంకితమిచ్చుచున్నాను.

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా ప్రస్తుతం దుగ్గిరాల మండలంలోని పెదపాలెం మా గ్రామం. దీనికొక విశిష్టత యున్నది. దేశ సేవా రంగంలో దీనిపాత్ర అభినందించ దగినది. ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్య

మం రూపుదాల్చక ముందే 1905 వ సం. లో యిచ్చట 'ఆర్య బాల సమాజము' పేరట నొక గ్రంథాలయం వెలసినది. హరిజనోద్ధరణకై మహాత్మాగాంధి రంగప్రవేశం చేయడాని కెంతో ముందుగ ఇచ్చట శ్రీ కృష్ణాశ్రమము స్థాపింపబడినది. 1920లో దేశవ్యాప్తంగా బయలుదేరిన సహాయ నిరాకరణ ఉద్యమంలో ఇచ్చటగల శ్రీ వెంకటాద్రినాయని ప్రాథమికోన్నతపాఠశాల జాతీయ విద్యాలయంగా మార్చబడినది. గ్రామ సేవాదృష్టితో 1928 వ సం.లో మేము ప్రారంభించిన సేవాశ్రమ పక్షమున జాతీయ విద్యాలయము, ఖద్దరు - స్వదేశీవస్తు నిలయము, రాష్ట్రభాషయగు హింద్రీ ప్రచారము, ఒక దశాబ్దము పాటు నిర్వహింపబడినవి. ప్రకృతి వైద్యం ప్రచారంలోకి తేబడినది. ప్రముఖ ప్రకృతి వైద్యులు డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య గారి అధ్యక్షతను ఒక పర్యాయం పది దినములపాటు సూర్యోపాసన శిబిరం నిర్వహింపబడినది. పరిసర గ్రామాలలో కాంగ్రెసు ప్రచారం సాగింపబడినది. గ్రామ గ్రంథాలయాన్ని పునరుద్ధరించి, దీనికి నూతన భవనమును నిర్మించుటయేగాక, దీని సేవను చుట్టుపట్లగల పల్లె గ్రామాలకు విస్తరించడం జరిగినది. మ్యాజిక లాంతరు ప్రదర్శనల ద్వారా గ్రామీణ ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి కృషి సల్పబడినది. మా కేంద్ర గ్రంథాలయం 'సేవాశ్రమ వాణీ మందిరం' పక్షాన మా వూరి ప్రక్కన ప్రవహించే బ్యాంకు కెనాల్ పై నడచే రెండు ప్రయాణీకుల పడవలలో రెండు సంచార గ్రంథాలయాలను 7 సంవత్సరాలపాటు మేము నిర్వహించినాము.

దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, సర్దార్ గొల్లపూడి సీతారామ శాస్త్రి, ఆచార్య రంగా ప్రభృతి దేశ నాయకులను, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి కవిపుంగవులను ఆహ్వానించి గ్రంథాలయ నూతన భవనప్రవేశోత్సవమును, సేవాశ్రమ వార్షికోత్సవమును 1933 వ సం. లో వైభవోపేతముగా జరుపుకొనుటయేగాక, పెద్దల ప్రశంసకు పాత్రులమైనాము.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము మందకొడిదాల్చిన పరిస్థితిలో దీనిని చురుకుగ సాగించుటకు ఉపాయముల నాలోచించుటకై వివిధ ప్రాంతములకు చెందిన ఉద్యమమునకు సంబంధించిన ప్రముఖుల సమావేశమును మా గ్రామములో జరిపినాము. గ్రంథాలయోద్యమ పితామహులైన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య గారి అధ్యక్షతను గుంటూరు జిల్లా గ్రంథాలయ మహాసభను ప్రముఖ విద్వాంసులు, గ్రంథాలయోద్యమనేతలు నైన సురవరం ప్రతాపరెడ్డి గారి అధ్యక్షతను ఇరువదిమూడవ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభను, దీని కనుబంధముగ గ్రంథాలయ ప్రదర్శనాన్ని విజయవంతంగా జరుపుకున్నాము. రెండు పర్యాయములు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘపక్షమున గ్రంథాలయ శిక్షణ శిబిరములను మాన్యశ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారి ఆధ్వర్యంలో నిర్వహించినాము. గ్రామ గ్రంథాలయాభివృద్ధితో పాటు మా సేవలు తెనాలి తాలూకాకు, గుంటూరు జిల్లా, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాలకు సహిత మందజేసినాము.

పైన వివరించిన వివిధ కార్యకలాపాలకు కారణభూతులు మా గ్రామస్థులైన శ్రీ పుతుంబాక సీతారామయ్య గారు. వీరు మా గ్రామ గ్రంథాలయ సేవా వృత్తాంతమును వివరముగా వ్రాసి సింగరేణి కాలరీస్‌లో జరిదిన 28 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సందర్భమున పంపినారు. దీనిని గ్రంథాలయ సర్వస్వములో ప్రచురించినాము. మా గ్రామ వికాసానికి వీరు గావించిన సేవ మరువరానిది. ఆర్యబాల సమాజ స్థాపన, కృష్ణాశ్రమ (హరిజన పాఠశాల) నిర్వహణ, శ్రీ వెంకటాద్రి నాయని జాతీయ పాఠశాల యేర్పాటులే గాక గ్రంథాలయ పక్షాన రాత్రి పాఠశాలను నిర్వహించారు. జాతీయ పాఠశాలలో తెలుగుపాఠాలు బోధించారు. కృష్ణాశ్రమంలోని విద్యార్థులను తీర్చిదిద్దినారు. ప్రకృతి వైద్య విధానాన్ని స్వయంగా అవలంబించుటయేగాక చుట్టుపటు గ్రామాలలో దీనిని వ్యాప్తి గావించినారు. స్వయంకృషితో నిరంతర పఠన పాఠనముల ద్వారా పాండిత్యాన్ని జ్ఞానాన్ని సంపాదించినారు. కవిత్వాన్ని సాధించినారు. సంస్కృతాంధ్ర భాషలతోపాటు తమిళం కూడ నేర్చుకొని 'తిరుపావై

గ్రంథాన్ని తెలుగులోని కనువదించి ప్రచురించినారు. గ్రామ వికాసానికి పలు రీతుల పాటుపడినారు.

వీరి అనుజులు శ్రీ కృష్ణయ్యగారు రామునికి లక్ష్మణుని వలె సదా వీరి వెంట నంటి బంటుగా పనిచేసి తెలుగు భాషలో ప్రావీణ్యంతోపాటు కవిత్వాన్ని కూడ సాధించినారు. అన్నగారివలె వీరు కూడ గొప్ప సంస్కారులు, గ్రంథకర్త, గ్రామంలోని శ్రీ కోదండరామస్వామి దేవాల యాభివృద్ధికి వీరు చాల పాటు పడినారు. పండితుల కవులను, దేశసేవకు లను ఆదరించినారు. గుప్త దానములు గావించినారు. అందరికీ తలలో నాలుకవలె మెలగినారు.

సేవాశ్రమ పక్షమున ప్రారంభించిన గ్రంథమాలలో వీరి 'భక్త హృదయము' ప్రథమ కుసుమము. ఇది పద్య రచన. 'భక్త జీవనము' వచన గ్రంథము. వీటిని చదువునప్పుడు వీరి కన్నుల వెంట ఆనంద బాష్పములు వెలువడు చుండెడివి. ఇవి కాక గుణరత్నకోశము, పలీక్షి ద్విలాసము మున్నగు మరి కొన్ని రచనలు వీరి కలం నుండి జాలు వారినవి. వీరి అగ్రజులు శ్రీయుతులు నరసయ్య, సీతారామయ్యలు మర ణించినప్పుడు వీరు వెలువరించిన 'అశ్రుతర్పణ'ము వీరి రచనా కౌశ లంతో పాటు వీరి సోదర ప్రేమను సహితం ఎంతో హృదయంగమంగా వెల్లడించునవిగా నున్నవి.

సేవాశ్రమ గ్రంథమాల పక్షమున మేము 1938 వ సంవత్సరంలో శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారనువదించిన బృహద్గ్రంథము 'బ్రిటిష్ మహాయుగము'ను రెండు సంపుటములుగ ప్రచురించినాము. నా మొదటి పుస్తకం 'గ్రంథాలయ శాస్త్ర ప్రథమ పాఠములు' నాకు పితృ తుల్యులు, గురువర్యులు నగు శ్రీ పుతుంబాక సీతారామయ్యగారికి మనకు స్వతంత్రము లభించిన పుణ్యదినము (15-8-1947)న సమర్పించు కొన్నాను. ఈ సందర్భమున జరిగిన సభకు దేశభక్తాగ్రగణ్యుడు, గ్రంథా లయోద్యమ పితామహుడు, వయోజన విద్యా కులపతియగు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారధ్యక్షత వహించినారు. నా గ్రంథాలయముల

(వ్యాసావళి) మొదటి భాగమును ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరరు, ప్రిన్సిపాలు, రిజిస్ట్రారు, వైస్ ఛాన్సలర్, పదవులను నిర్వహించుటయే గాక, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ అధ్యక్షులుగ నియమితులై యశస్సుగాంచిన డాక్టరు వాసిరెడ్డి శ్రీ కృష్ణగారికి, రెండవ భాగమును నా బాల్యమిత్రుడు, సహపాఠి, సేవాకార్యములో నా సహచరుడునైన శ్రీ పుతుంబాక శ్రీరాములుగారికి, మూడవ భాగమును నా గ్రామ పెద్దలు, వదాన్యులునైన శ్రీయుతులు వాసిరెడ్డి శక్తీశ్వరుడు, వాసిరెడ్డి నాగయ్య గారి కుమారుడు వెంకటప్పయ్యగార్లకు అంకిత మిచ్చియున్నాను. పెద పాలెంలోని సేవాశ్రమ స్థాపనలోను, నిర్వహణలోను అగ్రజులుగనుండి, దీని కార్యక్రమాన్ని చక్కగ నడిపించిన మిత్రుడు, మహాత్మగాంధి సబర్మతీ ఆశ్రమ వాసి, స్వాతంత్ర్య యోధుడునకు శ్రీ మేళ్లచెర్వు వెంక టేశ్వర్లుగారికి బాపూజీ శతజయంతిని పురస్కరించుకొని నేను వెలువరిం చిన అనువాద గ్రంథము 'బాపూజీ ముచ్చట్లు' అంకిత మిచ్చినాను.

వీరందరూ నా గ్రామస్థులు. నా జీవిత వికాసానికి, నా సేవా కార్యానికి వివిధరీతుల తోడుపడిన అభిమానులు, నా శ్రేయోభిలాషులు వీరితో చేర్చదగినవారు, ప్రేమ స్వభావులు, నాపట్ల వాత్సల్యము గలవారు నైన శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్యగారికి 'జీవిత ధర్మం' అనే యీ సంక లన గ్రంథాన్ని నా ప్రేమోపహారముగ సమర్పించుకొనుచున్నాను.

దీనిలోని విషయాలు పారాయణ కనుకూలంగా, మననంచేయ వలసినవిగా, ఆచరణ యోగ్యములుగా నున్నవి. కనుక విద్య నేర్చిన వారు దీనిని చదివి, విషయాన్ని గ్రహించి, జీవితధర్మ నిర్వహణలో తమ కర్తవ్యాన్ని నెరవేర్చుటకు యత్నించిననాడు సమాజం సుఖ శాంతులతో తులతూగ గలదని నమ్ముచున్నాను. నాచే యీ కార్యమును నిర్వహింప జేసిన పరమపితకు ప్రణమిల్లుచున్నాను.

ఇట్లు విన్నవించు

**పాతూరి నాగభూషణం**

సంకలన కర్త

# వి ష య సూ చి క

# జీవిత ధర్మం

౧

## మానవుడెవడు?

మనసును కట్టివేసుకో గలిగినవాడే మానవుడు
ఆలోచించి పని చేసేవాడే మానవుడు
నిగ్రహ నియమాలు పాటించేవాడే మానవుడు
తన కోపాన్ని అణచుకో గలిగినవాడే మానవుడు
ఇతరులకు సేవచేసేవాడే మానవుడు
ఇతరులకు సహాయం చేసేవాడే మానవుడు
ఇతరుల మేలుకోసం
కష్టాలు సహించేవాడే మానవుడు
ఇతరుల కోసం తన సుఖాన్ని
త్యాగం చేసేవాడే మానవుడు.

— 'బాలుర ప్రవర్తన' నుండి

౨

# యథార్థ మానవుడు

ఒకనాటి సాయంకాలం ఒంటరిగా వాహ్యాళికి బయలు దేరినాను. మధ్యలో ఒక కర్షకుని కలుసుకొన్నాను. ఆయనలో వినయం, సాధుత్వం ఉట్టిపడుచున్నవి. పటాటోపం మచ్చుకైనా కానరాదు. ఆయనతోపాటు పచ్చని గరికపై కూర్చున్నాను.

"అన్నా! నీకుగల ప్రగాఢ వాంఛ యేమి?"టని ప్రశ్నించినాను.

"యథార్థ మానవుడుగా మసలడమే" తన కోరికయని ఆయన తడుముకోకుండా చెప్పినాడు.

ఇంటికి వచ్చి ధ్యానంలో కూర్చొని దిగువ విధంగా చింతన చేసినాను.

"అన్నా! నీ అభిప్రాయం నాకు బాగా బోధపడింది. నేను కూడ యథార్థ మానవుడ నగుటకు ప్రయత్నిస్తాను. జీవితంలో లాభం కొరకు, కీర్తి కొరకు, విజయం కొరకు ప్రాకులాడడం మానివేస్తాను".

— టి. యల్. వాస్వాని

# ఉత్తమ మానవుడు

ఉత్తమ మానవుడు సంఘమున కొక రత్నమువంటి వాడు. అతడు తన జీవితమును పవిత్రము, స్వార్థరహితము, విశాలము చేసుకొనుకొలది ఈశ్వరుని సమీపించుచున్నాడు.

నా శిష్యుడయినవాడు ప్రతిదినము త్యాగము చేయుటకు సంసిద్ధుడయి యుండవలయు నని మహాత్ముడగు జీససు నుడివెను. ప్రజలు ఈ కథనమును గ్రహించి తమ ప్రయోజనము నిమిత్తము తమ జీవితమున దీనిని పరిశోధించుకొని చూడవచ్చును. ఉత్తమ మనుష్యున కెవరును తుల్యులు కాజాలరు. మనుష్యుడు ఉత్తముడు కానంతవరకు తన జీవిత సార్థక్యానుభవమును బడయజాలడు. మనుష్యుడు ఉత్తము డగుటకు దూషితాలోచనలను, అహంకారమును, తదితర దోషములను దూరముగ పారద్రోలుట అపేక్షణీయము. ఈ విధమగు జీవితము వలననే మనుష్యుడు ఈశ్వర పథమున నడువగలుగుచున్నాడు.

— జేమ్స్ ఎలన్

౪

# నే నె వ రు?

నే నెవరు?

నేను దీపపు ప్రమిదను.

అయితే, దీనిలో ప్రకాశించు జ్యోతి నీది.

నే నెవరు?

నేను రూపుమారిన లోహాన్ని.

అయితే, యీ మార్పుకు కారణమైన రాయి నీది.

నే నెవరు?

నే నొక చిన్న కాగితపు చుట్టను.

అయితే, దీనిపైగల ప్రేమాక్షరము నీది.

నే నెవరు?

నేనొక సిరాబుడ్డిని.

అయితే, దీనిలోని జ్ఞానమనే సిరా నీది

నే నెవరు?

నే నొక నీటి గొట్టాన్ని

అయితే, పిపాసను తీర్చి బాధను పోగొట్టే నీళ్లన్నీ నీవి.

నే నెవరు?

నేను గాలికి కొట్టుకొని పోయిన నావను.

అయితే, దిక్సూచి, నావికుడు నీవారు.

నే నెవరు?

నే నొక అగ్ని కణాన్ని.

అయితే, దీని కేంద్రపు జ్వాల నీది.

నే నెవరు?

నే నొక రంగు గాలి పటాన్ని.
అయితే, నన్ను పైకి లేపి ఉంచే దారం నీది.

నే నెవరు?

నేను యింటింటికీ తిరిగి వస్తువుల నమ్మే వ్యాపారిని.
అయితే, నే నమ్మే వస్తువు లన్నీ నీవి.

నే నెవరు?

నేను దాసులకు దాసుణ్ణి.
అయితే, నా సేవలోని తపస్సు, శక్తి నీవి.

నే నెవరు?

నేను పాటలు పాడుతూ వీథుల వెంట తిరిగే ఫకీరును.
అయితే, నా పాట లన్నింటిలోని గానం నీది.

— టి. యల్. వాస్వాని

## ౨౪

# శివోహం, శివోహం

నిత్యమైన ఉనికిలేని ఈ ప్రపంచంపై
    నే నెలా ఆధారపడగలను?
శరీరం నురుగు వంటిది
    బుద్బుద ప్రాయమైనది.
లోకంలోని ప్రతిదీ నశించేదే
    రాజులు, కవులు, శాస్త్రజ్ఞులు
    అందరూ మట్టిగా మారిపోయారు.
ప్రపంచమే పెద్ద కల
    దివారాత్రములు గడుస్తున్నవి
    ఇంద్రియాలు, మనసు మోసం చేస్తున్నవి.
నేను బందిపోటు దొంగను కనుగొన్నాను
    ఇత డెవరో కాదు, మనసే యీ దొంగ
వివేచన అనే ఖడ్గంతో
    దీనిని హతమార్చినాను
    ఇప్పుడిది నన్ను మోసం చేయలేదు
ఆత్మయనే ముత్యాన్ని కనుగొన్నాను
    ఇప్పుడు నిత్యానందాన్ని అనుభవిస్తున్నాను
నేను శివుడను
    శివోహం, శివోహం.

— స్వామి శివానంద

౬

## జీవితం

ఓ మానవుడా!
నీకు మంచి జన్మ లభించినది
దీనిని నీ వనుభవించు
ఇతరు లనుభవించడానికి సాయపడు.

జీవితం పూవు వంటిది
దీనివలె నీవు వికసించు
ఇతరుల వికాసానికి తోడుపడు.

జీవితం ప్రేమ జ్యోతి
దీనిని నీలో వెలిగించుకో
ఇతరులలో వెలిగించుటకు పూనుకో.

జీవితం అమృత పాత్ర
దీనిని నీ వాస్వాదించు
ఇతరుల కందించు.

— 'ప్రౌఢ శిక్ష' (హిందీ మాసపత్రిక) నుండి

౨

# జీవిత మనగా నేమి ?

జీవితమొక సవాలు-
దాని నెదుర్కొనుము
జీవిత మొక పోరాటం-
దానిని స్వీకరించుము
జీవిత మొక సాహస క్రియ-
దానిని నెరవేర్చుము
జీవిత మొక దుఃఖం-
దానిని జయించుము
జీవిత మొక విషాద గాథ-
దానిని తరించుము
జీవిత మొక ధర్మం.
దానిని నిర్వర్తించుము
జీవిత మొక క్రీడ-
దానిని క్రీడించుము
జీవిత మొక అద్భుతం-
దానిని విశదీకరించుము
జీవిత మొక పాట
దానిని గానముచేయుము
జీవిత మొక ఆనందం-
దానిని చవిచూడుము

జీవిత మొక అవకాశం—
దానిని వినియోగించుకొనుము
జీవిత మొక నాటకం-
దానిని నిర్వహించుము
జీవిత మొక యాత్ర—
దానిని సాగించుము
జీవిత మొక వాగ్దానం-
దానిని నెరవేర్చుము
జీవిత మొక ప్రణయం-
దానిని అనుభవించుము
జీవిత మొక సౌందర్యం—
దానిని ఉపాసించుము

— 'ప్రకృతి' మాసపత్రికలోని ఆంగ్ల రచనకు అనువాదం

## ౧

## జీ వి త మం టే?

జీవిత మంటే యేమిటని
సోదరు డొకడు ప్రశ్నించాడు
అత డొక గుంపు మధ్యలో ఉన్నాడు
దీని కొక వృద్ధు డిలా జవా బిచ్చాడు:

"జీవితమా? అది నురుగుకంటె, నీటి బుడగకంటె అధికమైనది కాదు."

యౌవన దశలోని అతని కలలు పటాపంచ లైనవి.

ఇంతలో ఒక యువకుడు "జీవిత మొక నాట్యం" అన్నాడు. అయితే ఉద్రేకంతో కూడిన యీ నాట్యమంతా వృథాగా ముగుస్తుంది.

ఒక కాలేజి విద్యార్థి షెల్లీని ఉటంకించి "జీవితం రంగు పూసిన తెర" అని వాకొన్నాడు.

అది వార్నిష్ రంగు పూసినది మాత్రమేనా? ఇంకా లోతైన, గంభీరమైన, గూఢమైన హృదయం దానిలో లేదా?

షేక్స్పియర్ కవికి అనుభవజన్యమైన వివేక మున్నది. ఆయన "జీవితం నేతగాని మగ్గంలోని నూలుకండె నుండే సాధనం" అన్నాడు.

అయితే దీనిలో మనం నేసే దేమిటి?

కోలెరిడ్జి 'జీవితం యోచన మాత్రం' అని చెప్పాడు.

అయితే దీనిలో ఆలోచన నధిగమించిన వేదన లేదా?

పవిత్రమైన ఉపనిషత్తులో "దైవమే జీవితం. మానవుడు దీని అంగం. కనుక జీవితం కలగాదు. కట్టుకథపటగా తిరస్కరించ దగినది కాదు. విషాదాంత నాటకం కాదు. నీడ గాదు. మాయ కాదు" అని చెప్పబడినది.

జీవితం దైవానుగ్రహం ద్వారా లభించిన కానుక. దేవుని కానుకలు సుందరములు, విచిత్రములు, పవిత్రములు నైనవి.

— టి. యల్. వాస్వాని



# జీవితమంటే బలిదానం

మతమంటే ఒకజాతి, ఒక ఆచారం,
ఒక శాస్త్ర పఠనం కాదు
మతమంటే జీవితమే
జీవితమంటే బలిదానం, యజ్ఞం
నీవేమి చేసినా, ఎక్కడ పనిచేసినా
పొలంలోగానీ, మగ్గంపైగానీ
ఫ్యాక్టరీలోగానీ, పాఠశాలలోగానీ
ఆఫీసులోగానీ
నీ నిత్యజీవితమే నీ ఆలయం
నీకు నీవే అర్చకుడివి
నీవే పవిత్ర గీతానివి
నీవే హోమాగ్నివి.

— టి. యల్ వాస్వాని

౧౦

# నిజమైన జీవితం

కాలం నిజమైన సంపద. ప్రతి నిమిషం, ప్రతి క్షణం ఎంత విలువయైనదో తెలిసికొనక పలువురు కాలాన్ని వ్యర్థంగా గడుపుతారు.

ఒక్క క్షణం కూడ వ్యర్థం కాకుండ శ్రద్ధ వహించండి. ప్రతిరోజూ ఏదైనా ఒక సత్కార్యం ద్వారా లోకాన్ని సేవించండి.

జీవితంలో మీకు తటస్థపడే కష్టంలో ఉన్నవారిని విడిచిపెట్టక, వారి భారాన్ని పంచుకోండి. వారికి సాయ పడండి.

ఇతరుల కుపకరించేదే నిజమైన జీవితం.

— టి. యల్. వాస్వాని

౧౧

## జీ వి త క ళ

జీవిత మొక సున్నితమైన కళ
సవ్యంగాను, శ్రద్ధతోను
దీనిని సాగించే పక్షంలో
సౌఖ్యం లభిస్తుంది.
ఇతరులతో వా రెవరైనాగానీ
ఉత్తమోత్తమంగా మెలగడంలోను,
విధి మనల నెట్టి పరిస్థితికి లోనుజేసినను
అత్యంత సంతోషంగా ఉండగలగడంలోను
జీవిత కళ యిమిడి యున్నది.

...

## ౧౨

# జీవిత ధ్యేయం

జీవితం నిన్ను నీలోనున్న గహనతరమైన దైవానితో ముడిపెట్టడానికి ఉద్దేశింప బడినది.

'జీవిత మొక ధ్యేయ'మని ఇటలీ దేశభక్తుడు మేజినీ నిర్వచించినాడు. ప్రేమసారమే జీవిత ధ్యేయం.

జీవితమంటే వెలుగు, ప్రేమప్రకాశం. దీనిని హృదయంలో వెలిగించు. నీ చుట్టుపట్టు ప్రదేశాలలో దీనిని వ్యాపింపజేయి.

అప్పుడు నీవు అపురూపమైన శక్తి, అంతర్దృష్టి గల వర్ణచిత్రకారుడవవుతావు. ఎన్నో జీవితాలను చక్కగాను, కాంతివంతంగాను తీర్చి దిద్దుతావు. 'హే భగవాన్! జీవిత మెంత సుందరం!' అన్న కవిగీతంలో లీన మవుతావు.

## ౧3

# జీవిత లక్ష్యం

జీవితమ్మది దేశ సంసేవ కొరకె
గాని భోగలాలసతకు గానె కాదు
సేవయే జ్ఞానమని చెప్పఁ జెల్లు గాదె
స్వార్థ మజ్ఞాన మగును నిజమ్ము సుమ్మ.

జీవితమును ధనమ్ము నార్జించుటందు
సారవిద్య ధనార్జన సాధనముగ
నెవఁడు వినియోగ పఱచు నా హీన నరుని
జన్మ మెంచగ వ్యర్థమౌ జన్మమెఁ గద!

దేహమును దేవళమ్ముగాఁ దెలిసి యెవఁడు
దాని మూలాన మోక్షసాధన మొనర్చు
వాని జన్మమె జన్మము, మానవాఖ్య
కాత డొక్కఁడె యర్హుఁ డీ యవనియందు.

తనదు చిత్తమున్ శాసించుకొనఁగ లేని
మానవుం డెంత పాండిత్య మహితుఁడైన
నెట్టి యధికార యుక్తుఁడై యెసగుచున్న
నతని నుత్తముఁ డనఁగ నర్హమ్ము గాదు.

నిష్కామకర్మమే నిజమైన కర్మ
మే కోరికయు లేకయే సల్పు సేవ
సంసార మను గాధ సాగర మ్మీద
భద్రమైనట్టి నావ యనంగ నొప్పు.

మరణముల్ సత్యరూపులు మంగళకర
మనుచు భావింతు రేగాని యడల రెపుడు
భయ విముక్తుఁడై వీరుఁడై పరిఢవిల్లు
నాత్మ నెరిగిన నజ్ఞాన మపుడె త్రుంచు.

అమిత బాధల నందుచు నవనియందుఁ
గొట్టుకొనుచున్న మానవకోటిఁ జూచి
గార్చు కన్నీరె నిజ భక్తిగణమునకు న
మూల్య ధనరాశి యని చెప్పఁ బోలదొక్కొ.

కాన నో మానవోత్తమా! దాన సత్య
శౌచ దయలను గల్గి నీ సారమైన
జీవన యాత్రను సాగించి చెల్లు మత్త్య
ధరను మానవ సేవ యీశ్వరుని సేవె.

—1940 నవంబరు నెల 'హిందూసుందరి' సంచికలోని
'గాంధి సుభాషితములు' నుండి

## ౧౪

# జీవితోద్దేశము

ప్రతి జీవితమునకును ఒక్కొక్క యుద్దేశము గలదు. లేనిచో జీవిత మనుదానికి వేరొండు యర్థమే కాజాలదు. మరియు నే మనుష్యుని జీవిత శబ్దమునకు రెండవ యర్థమును జేసెదరో వారు సూటిగా మార్గమును గోలుపోయిన వారగుదురు. కాని ఏదేనొక ఉద్దేశము లేని జీవితమే యుండనేరదు.

ఇట్టి ఉద్దేశాధారములగు ప్రతి జీవితమునకును నేదేని యొక స్థిరమగు యావశ్యక మొకటి సంబంధించి యుండును. అది వారివారి వ్యవస్థల ననుసరించి యుండును. కాని దాని ప్రత్యక్ష సిద్ధ ప్రయత్నముగూడ నీ యుద్దేశమును సాధించుట లోనిదియే యగును. కొందరు పురుషుల జీవితోద్దేశము యొక్క రెండవ యావశ్యక మింకొకటి గలదు. అది తమ చుట్టుప్రక్కలవారి సామాజిక, నైతిక స్థితిని సంస్కరించుట. అనగా తన జాతియొక్క విజ్ఞానస్థితిని చక్కబరచుట. ఈ రెండవ యావశ్యకమును బాగుగా గ్రహించి, అందలి వివిధాంశములను చక్కగా నెరింగి యభివృద్ధి గాంచిన సమాజము వారికి తమ జాతియొక్క జాతీయ భావమును బలపరచుట, లేక మతము లేక రాజకీయ పద్ధతులను సంస్కరించుట అను నీలాటి విషయములు ముఖ్యాంశములై యుండును. కాన జీవిత మొక యుద్దేశము కొర కేర్పడిన దని జెప్పుట కభ్యంతర ముండగూడదు. దనికి కర్తవ్య కర్మానుష్ఠాన దీక్షాపరతయే

గొప్పదగు శాసనము. తన జీవితముయొక్క ఉద్దేశమును జక్కగ గ్రహించి, దాని కనుగుణ్యముగ తన కర్తవ్యమును నెరవేర్చుటయందే ప్రతి మనుష్యుని యభివృద్ధియు నిమిడి యున్నది.

తన కర్తవ్య కార్యమును నెరవేర్చుట లేక నెరవేర్చ లేక పోవుటయను దానియందే యీ జీవిత మంగమయి పిమ్మట వేరొక విధమగు జీవితము మరల దొరకుట యను ప్రక్రియ నిలచియున్నది. ఏలయన తన యదృష్టమును తన కర్మల ద్వారా నిర్ణయించుకొనెడి యధికారము ప్రతి మనుజునకును గలదు. కాన ప్రతిమనుష్యుడును తన యాత్మను పవిత్రము గను, పరిశుద్ధముగను జేసికొని దానినే ప్రార్థనా స్థానముగ నేర్పరచు కొనవలయును. అహంకర్తృత్వ భావమును అందుండి దూరపరచి మిక్కిలి మెలకువతోడను, మిక్కిలి యోచనా విచారములతోడను, విశాల జ్ఞానముతోడను తన జీవితోద్దేశమును స్థిరపరుపవలయును. మరియు స్థితిగతుల యొక్క తీక్ష్ణ అనుభవముల వలన తన దేశమునకుగాని, లేక తన జాతికిగాని నేవిషయ మెక్కువ యావశ్యకమై యున్నదో కనుగొని, ఈయావశ్యకమును తన యోగ్యతా బలముల ననుసరించి, యే విధమున నెంతవరకు నెరవేర్పగలిగి యుండునో దానిని నిర్దేశింపవలయును. ఇవ్విధముగ తన యుద్దేశ (గమ్యస్థాన)మును నిర్ణయించుకొని యీ పిమ్మట తిరుగ సత్కార్యమును పరిపూర్తి నొందించుట యందు నిమగ్నుడు గావలయును. మరియు సత్కార్య నిర్వాహణమున దుఃఖ మాసన్న

మయినను, లేక సుఖమాసన్న మయినను, సంతోష మయినను లేక నపజయ మయినను గూడ తన జీవితాంతము దనుక యందలి ప్రాణిక్కిని విడనాడ కుండవలయును. అదియే ప్రతి మనుజునికిని విధాయక మగు కర్తవ్యము.

— లాలా లజపతిరాయ్

౧౫

# సమున్నత జీవితము

ఒక్కొక్క దినము చొప్పున 365 దినములు గడచుటచే ఒక పూర్ణ వత్సర మయినట్లు ఒక్కొక్క ఆలోచన, ఒక్కొక్క కార్యము వలన మానవ జీవితమునం దొక భాగము తయా రగుచున్నది. ఈ విధము లగు అనేక భాగములచే అతని సంపూర్ణ జీవిత మేర్పడుచున్నది. దయ, దాక్షిణ్యము, ఔదార్యము, త్యాగములచే పరిపూర్ణములగు చిన్న చిన్న పనుల వలననే మనుజుని దయార్ద్రము, ఉదారమునగు చరిత్ర నిర్మాణ మగుచున్నది. నీతిమంతుడు, నిజాయితీపరు డగు మనుజుడు జీవితముయొక్క చిన్న చిన్న విషయములందు సయితము నీతిని, నిజాయితీనే ఉపయోగించుచుండును. సచ్చరిత్రుడగు మనుష్యుడు పలుకు ప్రతి చిన్ని పలుకునందును, చేయు ప్రతి చిన్న పనియందును వాని సమున్నత చరిత్ర ద్యోతక మగుచుండును. నీ జీవితమును అనేక భాగములుగ గడుపుచున్నావు. ఆ భాగము లన్నియు కలసియే నీ సంపూర్ణ జీవిత మగుచున్నది. నీవు కోరుకొందు వేని నీ జీవితముయొక్క ప్రతి భాగమందు, ఘట్టమందు నిజాయితీని వీడకనే యుండగలవు. ఈ రీతిగ ప్రవర్తించుటచే నీ జీవిత మంతయు అత్యంత సమున్నతము కాగలదు.

— జేమ్స్ ఎలన్

౧౬

## జీవిత నిర్వహణ

అందరిలోను మనం సౌందర్యాన్ని
దర్శించ మొదలిడినప్పుడు
జీవితం ఆనందంగా వుంటుంది
ఇతరులలోని చెడును మనం చూచినప్పుడు
జీవితం దుఃఖకరంగా పరిణమిస్తుంది
మనం ఇతరుల లోపాల నెక్కువగా
వెదుకుతూ వుంటాం
సదా నీలోని దోషాన్ని తెలుసుకొని, నెమ్మదిగా
దానిని తొలగించుటకు యత్నించు
అప్పుడు జీవితం సాఫీగా నడుస్తుంది
అడుగడుగున ఆత్మ పరిశీలనతో
జీవితాన్ని నిర్వహించు.

— జెంషద్ నౌషర్వాంజీ

## ౧౭

## జీవితానుభవం

మనిషిపట్ల మనిషి ప్రవర్తన
    చాలా అన్యాయంగా ఉంటున్నది
ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో
    తెలియడం లేదు
ఎందరెందరినో నమ్మి
    దుఃఖానికి లోనైనాను
నావద్ద పైక మున్నది
    నాకొక మిత్రు డున్నాడు
నా పైకం నా మిత్రునికి
    అప్పుగా ఇచ్చాను
కొంతకాలానికి తిరిగి
    యివ్వవలసినదిగా కోరాను
దీనితో పైకం పోగొట్టుకొనడమే గాదు
    మిత్రుని కూడ దూరం చేసుకొన్నాను

—Indian Clique 1975 జూన్, జూలై సంచికనుండి

# ౧౮
# జీవిత పాఠము

సకల పాపములు అజ్ఞాన జనితములు. తమసావృతము, అశిక్షితము నగు బుద్ధియొక్క దశయే అజ్ఞానము. జీవిత విద్యాలయమందు సరిగ ఆలోచించని వానియొక్కయు సక్రమముగ కార్యక్రమ మాచరించని మనయొక్కయు స్థితి మూఢుడగు బడిపిల్లవాని స్థితినే పోలియున్నది. ఈశ్వర నియమానుసారము ఆలోచించ వలసిన విధమును, కార్యము నాచరింప వలసిన పద్ధతిని ఆ మనుష్యు డింకను నేర్చుకొనవలసి యున్నది. బడిపిల్లవాడు తన పాఠమును కంఠస్థము చేయు రీతిని నేర్చుకొను టవసరము. విధి పూర్వకముగ తన పాఠమును కంఠస్థము గావించని విద్యార్థి దుఃఖితు డగుచున్నాడు. తన పాఠము నభ్యసించు సక్రమ విధానము తెలిసినంతనే అతడు సుఖమును బడయుచున్నాడు. అదియే చందమున మనుష్యుడు సరియగు రీతి నాలోచించుటకు పనిచేయుటకు గల పద్ధతిని తెలిసికొనినంతనే సుఖమును బడయుచున్నాడు.

జీవిత కాలమందనేక పాఠములు చదువవలసి యున్నది. కొందఱు పాఠములను మిక్కిలి కష్టించి కంఠస్థము గావించుచుందురు. అట్టివారు పవిత్రులు, బుద్ధిమంతులు, సౌఖ్యవంతులు నగుచున్నారు. కాని కొందఱు తమ అసావధానత వలన ఆ పాఠములను కంఠస్థము చేయరు. అందువలన వారు అపవిత్రులు, మూర్ఖులు, దుఃఖితులు నగుచున్నారు.

—జేమ్సు ఎలన్

౧౯

# పవిత్ర జీవనం

పవిత్ర జీవనం
ఉన్నతోన్నతమైన, అత్యంత
యథార్థమైన కళ

సుఖము, తృప్తి, పవిత్రత
దీనిలో ప్రతిఫలించవలె

సాధన ద్వారా చక్కని సంగీతాన్ని
పలువురు సాధించగలరు కాని
విశుద్ధ జీవనపు పొందిక ద్వారా
బయలు దేరే సంగీతం
చాలా అరుదుగా లభిస్తుంది

సరళ జీవనంలో కళా కాంతు లుంటాయి
ఇది సరళ జీవనం సాగించే వారికే
ద్యోతక మవుతుంది.

త్యాగమయ జీవితం
యథార్థమైన ఆనందాన్ని
ప్రసాదించడంతో పాటు
కళకు శిఖరాగ్రం వంటిది.

— టి. యల్. వాస్వాని

౨౦

## జీవిత సార్థక్యం

పుచ్చుకొన్న దానికి ప్రతిఫలంగా
తిరిగి యివ్వడం జీవిత లక్షణం

గాలి, నీరు, వెలుగులను
నీవు గ్రహిస్తున్నావు

వీటికి తిరిగి యే మిస్తున్నా వని
అవి ప్రశ్నిస్తున్నాయి

పరిగ్రహణం జీవనం కాదు
దానికి ప్రతిఫలంగా
ద్విగుణీకృతోత్సాహంతో
ప్రదానం చేసిన ట్లయితే
మన జీవితం సార్థక మవుతుంది
పరిగ్రహణం వల్ల లభించే సౌఖ్యం స్వల్పం

— టి. యల్. వాస్వాని

౨౧

## గాంధీజీ అమృత వాక్కులు

మానవ జీవితం ఎంతో విలువైనది
అది సమస్యల వలయం
సుఖ దుఃఖాలకు నిలయం
జీవితానుభవాన్ని చవిచూచిన గాంధీజీ
జీవితంపై చక్కని నగ్నసత్యాన్ని చెప్పాడు

'జీవితం విషాదం — అధిగమించు
జీవితం పోరాటం - అంగీకరించు
జీవితం ఒక సవాల్ - ఎదుర్కో
జీవితం నిగూఢ రహస్యం - ఛేదించు
జీవితం విధి - నిర్వహించు'

అంతేకాక 'జీవితం—మరణం ఒకే నాణానికి వున్న బొమ్మ, బొరుసు లాంటివి' అనీ, 'ఒక అమరవీరుని మరణం అతని త్యాగానికి ఆఖరి మాట, అదే విజయానికి బాట' అనీ విశదీకరించాడు.

వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వ్యక్తి తన సర్వస్వాన్ని కోల్పోయినట్లే.

— చేగిరెడ్డి సత్యనారాయణ రెడ్డి

## ౨౨

### ఓ బా ట సా రీ!

ఒకటి వెంట నొకటి వసంతాలు
త్వరత్వరగా గడచి పోతున్నవి
అయినప్పటికీ నీ వింకా
చేరవలసిన చోటుకు
దూరంగానే ఉన్నావు

ఓ బాట సారీ!
లే ! మేలుకో !
అనంతమైన అవకాశంలో
పవిత్ర క్షేత్రానికి పయనం సాగించు
సాయంతనపు నీడలు సమీపిస్తున్నవి
మార్గం మధ్యలో ఎక్కడా మకాం పెట్టకు
పవిత్రులు వివేకులు నైన వారి
సాంగత్యాన్ని సంపాదించు
పరమాత్ముని స్తుతించే కీర్తన లాలాపించు
విశ్వాసంతోను, ప్రేమతోను బాధలోనున్న
ఆయన సంతానాన్ని సేవించు

ప్రతిరోజూ గురుకృపకై ప్రార్థించు
ఆయన కటాక్ష వీక్షణం
నీపై ప్రసరించే రోజు
నీ జీవితంలో ధన్యమైనదిగా తలంచు

మౌనమును ప్రేమించు
దేవుని నామ సంకీర్తనతో
బ్రతుకును సాగించు
చీకటి రాత్రులలో జాగరణ చేసి
స్వామిని ధ్యానించు.

— కుమారి శాంతి వాస్వాని

## —23

# జీవితాన్ని తీర్చిదిద్దే చదువు నేర్చుకో

ఎందుకొచ్చిన యీ చదువులు?
సోదరత్వాన్ని పెంచలేని చదువులు
మానవత్వాన్ని నేర్పని చదువులు
మంచితనాన్ని పోషించని చదువులు
మమతలు పరిమళించని చదువులు

పుస్తకాలలో ముఖాలు దాచి
మస్తిష్కాలలో పుస్తకాలను నిలిపి
ప్రతిక్షణం చదివి చదివి
విసిగిపోయిన విద్యార్థుల
కాంక్షలు ఫలించని సమాజంలో
అర్హతకు చోటే లేదు

అర్థానికి విలువ నిచ్చే కాలంలో
అన్యాయ మంటే వినేవాడు లేడు
అక్షరాస్యునికి నిరక్షరాస్యునికి
అసలే తారతమ్యం లేదు
తెలియక తప్పుచేసే అమాయకుడు నిరక్షరాస్యుడు
తెలిసి తప్పుచేసే మేధావి అక్షరాస్యుడు
నిరక్షరాస్యుడే ఇంకా నయం
మంచిని తెలుసుకుంటాడు

ఒక్కసారి చూడు -
చదివిన వాళ్ళే తప్పు చేస్తున్నారు నేడు
పుస్తకాల చదువులు జీవితాలకు పనికిరావనే
సత్యాలను గ్రహించే సమయాలు దాటి పోతున్నా
జీవితపు చదువు చదవలేక పోతున్నాం
భవితవ్యాన్ని తెలుసుకోలేక పోతున్నాం

అన్నా! నువ్వైనా నేర్చుకో
చిన్నా! నువ్వైనా తెలుసుకో
ఈ చదువులను మించిన చదువున్నదని
ఈ చదువు లేకపోయినా సరే
ఆ చదువు మాత్రం మరువకు
ముద్దు ముద్దుగా కాలాని కనుగుణంగా
జీవితాన్ని తీర్చిదిద్దే చదువు నేర్చుకో
సౌశీల్యం, వినయ విధేయతలు
చాలా అవసరమని తెలుసుకో
మమతలను మరచిపోకు
కలతలను రేపకు!

— యస్. వెంకటరెడ్డి

౨౪

# కర్తవ్యము

## ౧

కర్తవ్యము అత్యంత వ్యాప్తి యందున్న శబ్దము. కాని కష్టపడి అన్వేషించు వాని కిందు అనేక అమూల్య రత్నములు లభింప గలవు. మానవుడు స్వకార్యమునందు దృఢచిత్తుడయి, నిమగ్నుడయి యుండుటయు, అదియే వడువున ఇతరుల కార్యములకు చిక్కులను, ఆటంకములను కల్పింపకుండుటయు కర్తవ్య సిద్ధాంతమున కర్థము. అన్యుల కార్యముల యందు వ్యర్థముగ జోక్యము కలుగజేసికొని పరోపదేశమందు పండితు డయినవాడు తన పనిని తాను చక్కగ నిర్వర్తించుకొనజాలడు. మానవుడు తన ప్రస్తుత కార్యమును చక్కగ ఆకళించుకొని, నిశ్చల ధ్యానముతో, ఏకాగ్ర చిత్తముతో, తదేక నిష్ఠతో గావించుటకే కర్తవ్యమని పేరు. కర్తవ్యమునందు సంపూర్ణత్వము, యాథార్థ్యము, శ్రేష్ఠత్వము నిండి నిబిడీకృతమై యున్నవి. మానవుల కర్తవ్యములు వివిధములు. అన్యుల కర్తవ్య మేదియో తెలుసుకొనుట కంటె, తన కర్తవ్య మేదియో తెలుసుకొనుట ప్రతి మానవుని పరమ ధర్మము. కార్య గతులలో భేద ముండవచ్చును గాని సిద్ధాంతములో భేద ముండజాలదు. అది సార్వకాలికము, సార్వజనీనము, సార్వదేశికము. కర్తవ్యమును సంపూర్ణముగ, సమగ్రముగ ఎవడు పాలించినాడు?

స్వార్థమును బాసి గొప్ప సత్యపరాయణుడవై స్వీయ కర్తవ్య పాలనమును గావించుము. భోగ విలాసముల మునిగి కర్తవ్య పాలనమందు శైథిల్యమును రానీయకుము. ఇతరుల కార్యముల కవరోధముల గల్పింపకుము. నీ పనులకు నీతినే, నిజాయితీనే ఉపయోగించుము. వానిని బాయకుము. ఘోరాతి ఘోరములగు సంకటములు సంప్రాప్తము లయినను, ఒకవేళ నీ ప్రాణమునే గోలుపోవలసి వచ్చినను, భయము కలిగినను నీవు సత్యమార్గము నుండి అణుమాత్రమేని తొలంగకుము.

— జేమ్స్ ఎలన్

౨

సఫలతా ప్రాప్తికి కర్తవ్య పాలనము ముఖ్యము. ఏ తన్నిర్వహణ మతి కష్టము. అనుచితాభిలాషముల నంతరింపజేసి ఇంద్రియములను బందీలుచేసి సాహసింపవలయును. ఇక్కట్టులకు లెక్క చేయరాదు. మరణమునకు వెఱువరాదు.

"బంధురాత్మా ౽౽ త్మనస్తస్య యేనాత్మైవాత్మనాజితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తా ౽౽ త్మైన శత్రువత్"

ఆత్మ నిగ్రహము గలవానికి వాని ఆత్మయే బంధువు. ఆత్మ నిగ్రహము లేని మానవునకో వాని ఆత్మయే శత్రువువలె నపకారి యగును. కనుక సఫలతాభిలాషులు మానసమును చిక్కబట్టి దృఢతరముగ దమ కర్తవ్యమును నెరవేర్చినచో ఫలము లభింపక పోదు. కనుకనే స్వామి రామతీర్థులు "నీవు నీ నీడను పట్టుకోవలయు నని నీ జీవిత కాలమంతయు పరువెత్తియు పట్టుకొన జాలవు. కాని వెనుకకు మఱలి సూర్యుని దెసకు దిరిగి

పరుగెత్తుము. నీ నీడయే నిన్ను విడువక వెన్నాడును. అటు లనే నీవు ఫలమున కఱ్ఱులు చాపక నీ కర్తవ్యము ననుసరింపుము. అప్పుడు సఫలత కుక్కవలె నిన్ను వెంబడించును. న్యాయాధి కారి న్యాయవాదులను, వాది ప్రతివాదులను, సేవకులను పిలుచుకొన నక్కరలేదు. ఆ తడు తన పీఠమును దానా క్రమింపగనే యెల్లరు నరుదెంచి తమంత దా నెదురుగ నిలువ బడుదురు. అటులనే సంతోషముతో తమ విధిని నెరవేర్చిన వారికి ఫలము పాదాక్రాంతముగాక తప్పదు" అని చెప్పి యున్నారు.

స్వీయ కర్తవ్యమును పాలించిన సఫలులు అలౌకికా నందము నొందగలరు. కర్తవ్య పరాయణుడే లోకమున కేమైనని మేలు చేయగలడు. తా నున్నతి నొందగలడు. అటులనే ఫలాభిలాషి యగువాడు వాంఛితార్థ ప్రాప్తి చేకూరదు. 'నరకయాతన' నందగలడు. అప్పటి దుఃఖమునకు మితి యుండదు. నిశ్చయమే; కాని విఫలుల మైనంత మాత్రమున హా తాశులము గారాదు. తద్విఫలతా కారణములు కనుగొని దూరమొనరించి తిరిగి ప్రయత్నింపవలయును. పూనిన కార్యమెల్ల ప్రథమ ప్రయత్నముననే ఫలియించునని కాని, పట్టినదెల్ల బంగార మగునని కాని భావింపరాదు. కష్టములు లేకుండగాని, విఫలతలు గలుగకుండగాని, స్వల్పకాలమున గాని మహా ఫలములు లభియింప నేరవు. ఆశ్చర్య జనకములగు నేటి యాకాశ విమానములు, ధూమ శకటములు మున్నగు యంత్రములు ఒక్కతరమున సాంఖ్య పూర్వకముగ నిర్మింపబడిన వందురా! సఫలతా శిఖరము నధిరోహించుటకు విఫలతలే సోపానము

లగును. ఆ సోపాన క్రమము నుపయోగించుకొనువాడే శిఖరము నధిరోహింప గలడు. ప్రయత్నహీను డగు భీరుడు అవిఫలతలు—కష్టములుగని గుండెలు పగిలి నిశ్చేష్టుడగును.

— వడ్లమూడి వేంకటరత్నము

3

అన్యుల దూషణ భూషణములకు, అపవాదములకు లొంగి, క్రుంగి నీ కర్తవ్యమును మరువకుము. ఇతరుల అభిప్రాయములకై పెనగులాడి నీవు చెడిపోకుము. ఇతరుల అభిప్రాయముల గనుగొనుటకు మున్ను నీ అభిప్రాయ మేమో నీ అంతరంగము నడిగి కనుగొనుము. నీ వుచితమని తలంచిన దానిని త్యజించకుము. ఎవ రేమనినను నీ సత్యదృష్టిని మరల్చకుము. ప్రజల జోలి నీకేల? నిజాదర్శముపై పట్టువీడి యొరుల అభిప్రాయములకై పాలుబడి నీవు చెడిపోకుము.

— లాలా లజపతిరాయ్

కర్తవ్యములో మాధుర్యమున్నది.

— మహాత్మాగాంధి

సత్యసంధుడు, కర్తవ్యపరాయణుడు నగు వ్యక్తియొక్క మార్గమును ఎవరును అడ్డజాలరు.

— రవీంద్రనాథ ఠాగూర్

నీవు కర్తవ్యమును నిర్వర్తించుము. ఫలితమును దైవమునకు విడిచిపెట్టుము. ఇదియే ఉత్తమ మార్గము.

— లాంగ్ ఫెలో

## ౨౫

# ధర్మము

ధర్మమును గూర్చిన చర్చ లెల్లెడలను జరుగుచునే యున్నవి. వాద ప్రతివాదములు గూడ తరచుగ జేయబడు చున్నవి. ఉపన్యాసములు, ఉపదేశములు సయితము ననంఖ్యాకములుగ సలుపబడుచున్నవి. చందాద్రవ్యములు గూడ నీయ బడుచున్నవి. ఇది యంతయు నెక్కువమే. కాని యికనందులో లోప మేమున్నదో ధర్మపరాయణులును, ధర్మానుష్ఠాన తత్పరులును నగువారలు లేకుండుట యొకటియే కొదువగ గాన్పించు చున్నది. ధర్మపరాయణత లేశమును లేక కేవల వాగాడంబరం మాత్రమే గలిగియుండెడి మనుజుల నా ధర్మము దన దరికి చేరనియ్యదు. మరియు నధర్మమునే జీవనముగ గయికొనిన వానికడ కదిగూడ నరుగదు. ధర్మము యితర సంబంధమును కేవగించుకొనెడి స్వభావము గలది. తన భక్తుల నది భుజింప వలదనియును, త్రావవల దనియును, వివాహ మాడవల దనియును, సంతానమును గనవల దనియును, భాగ్యము నార్జింప వల దనియును నిర్బంధపరుపక, నీవేమేమి జేసెదవో దాని నెల్లను నా కొరకు జేయుము. నా పేరిట జేయుము. నా ప్రీతి నభిలషించి జేయుము. నా యందు పరాయణత గలిగి జేయుము అని మాత్రమే బోధించుచున్నది. మరియు నన్ను ప్రేమించెడు వారలను నింకెవ్వరితోడను మైత్రిసలుపవల దనియును, దేశముయొక్కయు, జాతియొక్కయు సేవ యం

దన్వయించి యుండవలయు ననియును, ఆపదగ్రస్తుల నాదరింప వల దనియును, వారిపట్ల సాహానుభూతి గలిగియుండవల దనియును, ప్రతిబంధింపక నీ వే కార్యము నెంతగ ప్రేమించెదవో యది యెల్లను నన్ను ప్రేమించుటకై యుండవలయును, నా పేరట నుండవలయును, నా కొరకై యుండవలయును, నా కర్పణము గావలయును అని మాత్రమే గోరుచున్నది.

ధర్మము తన రాజ్యాధికారమునం దింకొకరిని జేర్చుకొనదు. మరియొకరికి దనతో సమానమగు తరగతి నీయదు. ఇవ్విధముగ నది సదా యద్వితీయమై యుండగోరును. మరియు నాధర్మ మితర సంబంధమున కెంతగ సేవగించుకొనునో తన భర్తృ తన యాజ్ఞలను క్రమముగ ననుష్ఠింపక లేశమాత్ర మేనియు నభ్యంతర మొనర్చినపట్ల నంతకంటె నెక్కుడుగా సేవగించును. కనుక, నే మనుష్యుడు ధర్మముయొక్క యాజ్ఞల ననుష్ఠించుటలో దన శిరము నేనియు, దన యవయవముల నేనియు, తన ధనము నేనియు, వేయేల, చివరకు దన ప్రాణము నేనియు లక్ష్యము సేయడో అట్టి మానవుడే ధార్మిక శబ్ద ధారణమున కర్హుడు. లేక శ్రీ కృష్ణుని వచనానుసారముగ నే మనుష్యుడు, భుజించిన నాధర్మముయొక్క ఉత్తర్వు ననుసరించి భుజింపుచున్నాడను, త్రాగిన-నా ధర్మముయొక్క ఆజ్ఞ ననుష్ఠించుటకై త్రాగుచున్నాడను, దానమిచ్చిన-నిది నాధర్మమునకు సమ్మతమై యున్నందున నిచ్చుచున్నాను, యజ్ఞము జేసిన నిట్లు జేయుటయే నా ధర్మమునకు సంతోషావహము గాన జేయుచున్నాను, అని త్రికరణ శుద్ధిగ భావించునో, అట్టి మనుష్యుడు ధర్మపరాయణు డను పదధారణమున

కష్టము. అట్టి మనుష్యుడే రెండవ వారలకు ధర్మ పరాయణు లగుటకుం దగిన బోధనల బోధించుట కష్టము.

అక్కటా! ఈ దేశమున ధర్మము లేదు. ధర్మపరాయణులగు మనుష్యులు లేరు. ఇందువలననే దురదృష్టశాలినియగు నీ దేశమును, దీనియం దావాసులై యున్న ప్రజలును నానా విధములగు బాధలం జిక్కి పరితపించుచున్నారు. ప్రతి మనుష్యుడును తన కిచ్చవచ్చిన స్వరూపమునే ధర్మముగ స్థిరపరచుచున్నాడు. తనచే జేయబడిన బొమ్మలను పూజించుట వలననే ముక్తి నార్జింప గోరుచున్నాడు. ఇట్లు తా నొక్కడు జేయుట మాత్రముతో తృప్తి జెందక నితరుల హృదయములను గూడ నీ ప్రతిమల తట్టు నాకర్షింపుచున్నాడు. మరియు "దీని నెవరు సందేహించెదరో వారలకు సద్గతులు లేవు. అట్టి వారలు నాస్తికులై, వ్యర్థులై నరకమునంబడి చెడిపోగలరు" అని దగుత్తికతో నరచుచున్నాడు. అయినను ప్రాచీన (స్వాతంత్ర్య) కాలమునందు ధర్మపరాయణులుగ నుండిన పురుషులయొక్క ధర్మవర్తన మెట్లుండెనని బరిశీలించి చూడ దలచినచో వార లనుష్ఠించిన ధర్మము వేదమునందు గానం బడును. కాని అట్టి వేదార్థము యొక్క విజ్ఞాన ద్వారము లిప్పుడు బంధింపబడి యున్నవి. అమ్మహా విద్యాభవనము లోనికి శక్తిహీనులును, బుద్ధి హీనులును, విద్యాహీనులునునగు సద్విద్య నెరుంగని మముబోటి నిరక్షర భట్టాచార్యులు ప్రవేశింప జాలరు. కనుకనే మనము దానిలోపలి వివిధ విజ్ఞాన వైభవములం దిలకింపజాలకుండు ట టుండ, పైని బిగించి యున్న గొళ్ళెముల నయినను వదలింపజాల కున్నాము.

ప్రశ్న : అట్లయినచో నిక మన వ్యాధి కేది మందు?
ఈ రోగమున కిక ఔషధమే లేదా?

ఉత్తరము : ధర్మము యొక్క సామీప్యమున నుండియున్న ధర్మాంగముల ననుష్ఠించి యారోగ్యము నొందుట తప్ప వేరు వైద్య మెద్దియు లేదు.

ప్రశ్న : అవి యేవి?

ఉత్తరము : (భగవద్గీత యొక్క పదునారవ యధ్యాయ మందలి ౧, ౨, 3 శ్లోకములఁ జూడుము)

౧. అభయము (పరమేశ్వరునకు దప్ప నితరులకు భయపడకుండుట)

౨. మనశ్శుద్ధి
3. శుద్ధాత్మ స్వరూపమును వివేచింపదగిన జ్ఞానయోగమును. బుద్ధికి స్థిరత గావించుట
౪. దానము
౫. దమము (మనోనిగ్రహము)
౬. యజ్ఞము (మత కర్మము)
౭. స్వాధ్యాయము (శాస్త్ర పఠన పాఠనములు)
౮. తపము
౯. అహింస (ధర్మమునకు వ్యతిరేకముగ నెవరికేని పీడ గలిగింపకుండుట)
౧౦. సత్యము
౧౧. అక్రోధము (కోపము లేకుండుట)

౧౨. త్యాగము (ఆత్మకు అనుకూలము గాని వస్తువులను త్యజించుట)

౧౩. శాంతి

౧౪. ధైర్యము

౧౫. స్థైర్యము

౧౬. క్షమ (ఓర్పు) మొదలైనవి.

ఆ మహా యోగస్థానములోని కేగుటకై ఈ యుద్యోగి యుల యొక్కయు, ఈ యోగస్థాన ప్రముఖుల యొక్కయు సహాయమును వేడి యుక్తరీతులతో వారల దయానుగ్రహముల నంది యారోగ్యము నన్వేషించుట మన కందరకు కర్తవ్యముగ నుండవలయును.

ధర్మముయొక్క ప్రీతికై ధర్మము ననుష్ఠించుటయే ప్రతి యొక జీవాత్మకును గమ్యస్థానము. ఈ గమ్యస్థానమున కరుగుట కనేక మజిలీల నధిగమించు టావశ్యకమై యుండును. ఈ మజిలీలయం దేదైన నొకదానిని ప్రత్యేకము తన జీవితోద్దేశముగ బెట్టుకొనుట ప్రతి మనుజునికిని ప్రథమ కర్తవ్యము. ఏ మనుష్యుడీ కర్తవ్యము నెరుంగునో యాతడిక సూటియగు చక్కని త్రోవ కేతెంచిన వాడని భావింపనగును. అట్టి మనుష్యుడిక నా పిమ్మట నా మార్గమున కంతరాయము, యభ్యంతరము గలిగించెడి యోచనలం జేయక, దన ప్రాకృతిక బలము నంతను నా మజిలీల ననుగమించుటకై వ్యయపరుప వలయును.

పదునెనిమిదవ శతాబ్దము యొక్క భౌతిక (మెటీరియల్) తత్త్వ శాస్త్రము జీవితమును సౌఖ్య సంతోష స్థాన

ముగ స్థిరపరచెను. దీని పర్యవసానము వలన మానవులలో స్వార్థపరత్వ స్వోత్కర్ష తాభిప్రాయములు వివిధ రూపములతో దట్టముగా వ్యాపించి తన్మూలమున మానవ జీవితమునకు ముఖ్యమగు పరమావధి యెద్దియో దానియందు లక్ష్యమే లేకుండ నయ్యెను. ప్రతి మనుష్యుడును తన లాభనష్టముల లోననే క్రిందు మీదులై మునుగుచు దేలుచున్నాడు. ముఖ్యమగు పరమావధి కొరకును, సత్యము కొరకును అర్పణ గావించెడి యభిప్రాయము బొత్తుగ కృశియించి పోయినది. కనుకనే ప్రజలు కొంచె మేదైన కష్టములు కలుగుటతోడనే, లేక కొంచెపాటి యపజయ మేదైన వాటిల్లుట తోడనే దమ పరమావధిని క్రిందబెట్టి నలిపివేయుచున్నారు. మరియు దమ యభిప్రాయములను మార్చుకొని యే కార్యమును దామేదైన నొక పరమావధి యొక్క సాధన ప్రయత్నమునం దారంభించిరో దానిని వదలిపెట్టు చున్నారు.

ఇవ్విధమగు కృత్యము వలన బయటపడిన దగు నా యభిప్రాయమీ గహన సమస్యకు ప్రత్యుత్తరముగ నిట్లు దెల్ప సాహసించి నందుకు విచార పడుచున్నాను.

ఆత్మ నశించెడిది కాదు. ఒక పర్వత శిఖరముపైన దేవు డధిష్ఠించి యున్నా డనియును, అచ్చటి కేగిన మన కానాదము సిద్ధించు ననియును పరిపూర్ణ విశ్వాసముతో నొక మనుజు డచ్చటి కెక్కుచున్నట్లే ఈ యాత్మ గూడ వివిధ జీవిత రూపములగు కక్ష్యలపై నభివృద్ధి నొందుచున్నది. కాన

నాత్మయొక్క వివిధ జీవితము లన్నియు వాస్తవములో నొకే మాల యొక్క పూసలుగ నున్నవి. వీనిలో క్రమ క్రమముగ నీ యాత్మ యుదయమై యభివృద్ధి నొందు చుండును.

— లాలా లజపతిరాయ్

## ౧౬

# వివిధ ధర్మములు

సత్యము - అసత్యమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును అబద్ధమాడదు.

శాంతము - క్రోధమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అదియెన్నడును కోపింపజాలదు.

దయ - అన్ని ప్రాణులను తన ప్రాణముతో సమానముగా కాపాడుటయే దాని ధర్మము. అది యెన్నడును నిర్దయ చూపజాలదు.

ధర్మము - లోభమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును లోభము చూపజాలదు.

ఓర్పు - ఎన్ని కష్టములు వచ్చినను ఓర్చుకొనుటయే దాని ధర్మము. అది యెన్నడును సహనమును వీడజాలదు.

జ్ఞానము - అజ్ఞానమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును అజ్ఞానముగా ప్రవర్తించదు

అహింస - మనసుతో, మాటతో, క్రియతో ఏ ప్రాణిని హింస పెట్టకుండుటయే దాని ధర్మము. అది యెన్నడును హింస చేయుటకు పాల్పడదు. తమ మాంసమును కాపాడుకొనువారు మాంసభక్షణము చేయక పోవుటయే వారి ధర్మము. అట్టి వారెన్నడును మాంస భక్షణమునకు లోబడరు.

అపరిగ్రహము - పరులనుండి యేలాటి వస్తువులను, సేవలను ఉచితముగా తీసికొనకుండుట అపరిగ్రహము కలవారు. యితరులను 'రా' అని పిలువనైనా పిలువరు. అట్లు 'రా' అని పిలుచుటయు పరిగ్రహమే.

ఇన్ని ధర్మములు తానై దేని ధర్మము దానికి పంచి పెట్టగా, ఆత్మలో వాటికి హక్కులేక, విషయముల బలము పోయి, అవి నిర్విషయము లగును. అనగా లేని వగును. ఉండునది పరమాత్మ.

— చిన్నమ్మ

## ౨౭

# ధర్మమార్గం

సుఖమార్గమునకే ధర్మమార్గ మని పేరు. ధర్మ మాచ రించుచున్న వాడు దుఃఖ మనుభవించుటయు, అధర్మ మాచ రించువాడు సుఖ మనుభవించుటయు లోకములో కన్పట్టుట లేదా యన ఆచరించు ధర్మాధర్మములకు ఫలము వెంటనే సంభవింపక పోవచ్చును. ఎన్నడో చేసిన ధర్మాధర్మముల కిప్పుడు ఫల మనుభవములోనికి రావచ్చును. ఇప్పుడు చేయు చున్న ధర్మాధర్మములకు ఫల మికముం దెప్పుడో యనుభవము లోనికి రావచ్చును. భౌతిక ప్రపంచములో కూడ నిట్టి యను భవము మనకు కన్పట్టు చున్నది. నిన్న తిన్న 'యజీర్ణ వస్తువు' నకు ఫలము నిన్ననే కల్గుట లేదు. నేడు కల్గుచున్నది. పుణ్య పాపములకు సంబంధించిన ఫలము చిరకాలమునకు పిమ్మట గాని, జన్మాంతరములోగాని, లోకాంతరములోగాని కల్గు ననుటలో ఆశ్చర్యము లేదు. వ్యవసాయము జరుగుచున్న భూమి యప్పటి కప్పుడే ఫలింపదు. కావున పాపులు సుఖ ముగా నుండుటను, పుణ్యాత్ము లాపదలతో నుండుటను చూచి యెవ్వడును ధర్మము వలన లాభము లేదనియు, న ధర్మము వలన హాని లేదనియు తలంపరాదు.

అధర్మము చేసిన వెంటనే దాని ఫలము కన్పడక పోవచ్చును. భూమి దున్నిన వెంటనే ఫలము నీయదు కదా!

అధర్మము క్రమముగా ఫలోన్ముఖమై కర్తను సమూలముగా నాశము చేయును.

అధర్మము చేసిన వానికి తత్ఫలము అనుభవములోనికి వచ్చును. అంతేగాని వ్యర్థముగా పోదు. కావున తాత్కాలికముగా సుఖము నపేక్షించిగాని, దుఃఖమును తప్పించుకొనుటకుగాని యధర్మమును చేయరాదు. ఆ యధర్మము వలన వచ్చు దుఃఖ మింతకంటె మిక్కుటముగా నుండును.

ధర్మముతో నున్నవాడు దారిద్ర్యాదులచే బాధపడుచున్నను అధర్మమందు బుద్ధిని చొరనీయగూడదు. ధర్మమును వీడుచో దుఃఖము పోయి సుఖము వచ్చునని తలంపరాదు.

ఎవడు ధర్మహీనుడో, ఎవడు అన్యాయముచే ధనమును సంపాదించునో, ఎవడు హింసాపరుడో వానికి సుఖముండదు.

ధర్మము తప్ప యేదియు నమ్మదగిన మిత్రము కాదు.

ధర్మము మానవుని ఉద్ధరించుట ఎంత సత్యమో, అధర్మము మానవుని ముంచివేయుట అంత సత్యము... మానవుని మంచి స్థితిలో నిలబెట్టునది ధర్మము.

ధర్మము కొట్టబడినదై మనలను కొట్టివేయును. రక్షింపబడినదై మనలను రక్షించును. కావున ధర్మము ఉల్లంఘింపదగినది కాదు.

ధర్మమొక్కటియే సర్వకాలములలోను తోడ్పడు మిత్రము.

— జటావల్లభుల పురుషోత్తం

## ౨౦

# ధర్మాచరణ

భగవంతుడు ధర్మ రక్షణ కోసం అవతరిస్తాడు
సత్పురుషులు ధర్మాన్ని రక్షిస్తారు
సజ్జనులు ధర్మాన్ని ఆదరిస్తారు
ధర్మాన్ని రక్షించేవాణ్ణి ధర్మం రక్షిస్తుంది
ధర్మ మర్యాదను కాపాడేవాడి మర్యాద స్థిరంగా నిలుస్తుంది

శిబిచక్రవర్తి ధర్మాత్ముడు
రంతి దేవుడు ధర్మాత్ముడు
యుధిష్ఠిరుడు ధర్మాత్ముడు

ధర్మాత్ముల పేరు శాశ్వతంగా నిలిచి పోయింది
ధర్మాత్ములకు దైవ సాన్నిధ్యం లభించింది
ధర్మాత్ములను లోకం గౌరవిస్తుంది
ధర్మాచరణవల్ల సుఖం లభిస్తుంది
ధర్మాచరణ వల్ల శాంతి లభిస్తుంది
ధర్మాచరణ వల్ల కీర్తి పెరుగుతుంది
ధర్మాచరణ వల్ల శుభం కలుగుతుంది

ధర్మం ఉన్నచోట దుఃఖం ఉండదు
ధర్మం ఉన్నచోట అశాంతి ఉండదు
ధర్మం ఉన్నచోట జగడాలు, తంటాలు ఉండవు
ధర్మం ఉన్నచోట దయ ఉంటుంది

ధర్మం ఉన్నచోట సత్యం ఉంటుంది
ధర్మం ఉన్నచోట ఓర్పు ఉంటుంది
ధర్మం ఉన్నచోట ఔదార్యం ఉంటుంది
ధర్మం ఉన్నచోట ఆనందం ఉంటుంది

మనం ధర్మాన్ని ఆచరిద్దాం
మనం ధర్మానికి కట్టుబడి ఉందాం
మనం ధర్మానికి అనుకూలంగా నడచుకుందాం

— 'పౌర ప్రవర్తన' నుండి

౨౯

# మానవ ధర్మము

ధర్మము భేదదృష్టిని బోగొట్టును. దయార్ద్ర భావములను వృద్ధిజేయును. విజయలక్ష్మిని సమకూర్చును. మానమర్యాదల బ్రసాదించును. చిత్తస్థైర్యమును, ఏకాగ్రతను బడయజేయును.

సమస్త ధర్మములలో హింసాత్యాగము (అహింస) నే ఉత్కృష్ట ధర్మముగా గణుతింపవలెను. సంకల్పముల చేతగాని, వాక్కులవలనగాని, కర్మలద్వారాగాని పరుల కెవరికిని కటకట కలుగజేయకుండుటయే అహింస యనంబరగు. ఏనుగు పాదము నందు సర్వ జంతువుల పాదము లిమిడియున్నట్లు 'అహింస' యందు సమస్త ధర్మము లంకితములై యున్నవి మానవులు ధర్మయుత జీవితమును గడపిన ఆ ధర్మమే వారిని విపత్సమయములందు రక్షించును. మానవ జీవితములో నెట్టివంటి కష్టసుఖములు, లాభనష్టములు వచ్చినను చివరకు ధర్మమునకే జయము కలుగును. ఎచట ధర్మ ముండునో అనగా నెవరు ధర్మపాశ బద్ధులై తమ జీవితములను గడపెదరో వారికే సుఖశాంతు లుండును. మానవ ధర్మము మాధవ నివాసమునకు గొనిపోవును. ధర్మమే భగవంతుడు.

మానవ జీవిత ముఖ్యోద్దేశము "ఆత్మవత్సర్వ భూతాని యఃపశ్యతి సపశ్యతి। ఉదార చరితానాంతు వసుధైవ కుటుం

బకమ్" అనునదియే మానవ ధర్మము. తన శరీరమును, తన బంధువులను, మిత్రుల నెటుల ప్రేమతో దయార్ద్రదృష్టితో జూచుచు ప్రపంచము నందలి ప్రాణికోటి నంతను ఆ విధముగా ప్రేమించుటయే సరియగు మానవ ధర్మము. శత్రు మిత్రోదాసీన భేదములు లేక జగమునందలి పరుల నందరను నారాయణ రూపులుగా తిలకించి మన మందరము నొకే యొక కుటుంబము వార మను దృఢ విశ్వాసముతో నుండి సర్వ జీవులను హృదయపూర్వకముగా ప్రేమించి గౌరవించుటయే "మానవ ధర్మము". సంఘములో నెచట, నెవరికైనను నెట్టి విపత్తు సంభవించినను మనస్సుతో వారి కష్టము లందు భాగస్వామియై వారి క్లేశములను పారదోలుటకు నిష్కపటముగా ప్రయత్నించుటయే సత్యమగు మానవ ధర్మము. పరుల సిరి సంపదలను దిలకించి యీర్ష్యాదులను జెందక వారితో సద్వ్యవహారములు సల్పుటయే మానవ ధర్మము. తాను గౌరవ మర్యాద సన్మానములు గోరక పరుల నందరిని గౌరవించి, పరు లెవరైన దన కపకారము చేసిన దానిని వెంటనే మరచి వారియందు దయాదాక్షిణ్యములు చూపి భూదేవి యంతటి ఓరిమి కలిగి, నిరంతర భగవన్నామ స్మరణ మొనరించుటయే మానవ ధర్మము.

మానవులందు దశవిధ ధర్మములు కలవు. అవి యేమనగా 1. ధైర్యము. 2. తితిక్ష, 3. ఇంద్రియ నిగ్రహము, 4. దొంగతనము చేయకుండుట, 5. పవిత్రముగా నుండుట, 6. విషయ వైముఖ్యము, 7. బుద్ధి సంపద, 8. ఆత్మ విద్య, 9. సత్యభాషణము, 10. క్రోధ రాహిత్యము. సామాన్య

ధర్మములగు వీనిని పరిపాలించు వారలు సంపూర్ణ మానవులని తెలిసికొనవలెను. ధర్మావలంబియగు నరునకు అష్టసిద్ధులు నతులొనరించి భృత్యులగును. ధర్మమయ జీవితము గడపు మానవుని సమీపమునకు దుష్టశక్తులు దరిజేర నేరవు. ధన కనక వస్తు వాహన ప్రలోభము లాతని నేమియు జలింపజేయ లేవు. అజ్ఞాన. మాయా నరకములు ధర్మమయుని చూచి దూరముగా పోవును. మునీశ్వరుల యాశ్రమములందు పశుపక్ష్యాదులు పరస్పర విరోధములను వీడి ప్రేమించుకొనుచుండును గదా! దానికి గారణము మానవ ధర్మపాలనమే.

— అను. పసుమర్తి శ్రీరామశాస్త్రి

## ౩౦

# ధర్మము - స్వధర్మము

ధర్మము దైవ కల్పితము
స్వధర్మము మానవ కల్పితము
ధర్మము విశ్వ జనీనము
స్వధర్మము వ్యక్తిగతము
ధర్మము సార్వకాలికము
స్వధర్మము తాత్కాలికము
ధర్మము నిర్వికారము
స్వధర్మము సవికారము
ధర్మము నిష్కళంకము
స్వధర్మము క్వచిత్కళంకము
రెండును పావనములేగాని
ధర్మము పావన తరము
రెండును మానవులకు
సమానముగా అవశ్యాచరణీయములే
దేనిని విడనాడినను ముక్తిలేదు

స్వధర్మమును సర్వదా నిర్వహించుచు ధర్మోపద్రవము సంభవించినపుడు స్వధర్మమును విడనాడి యైనను ధర్మమును పాటించుట ముఖ్య కర్తవ్యము.

— శ్రీ రామకృష్ణ సేవాసంఘము, పలాసా వారి కరపత్రము 'భీష్మని చరిత్ర' నుండి

## ౩౧

# గాంధీ మార్గము

గాంధీ మార్గం సత్య మార్గం
అహింసా మార్గం
నీతి మార్గం
ధర్మ మార్గం
ప్రేమ మార్గం
కరుణా మార్గం
శాంతి మార్గం
సేవా మార్గం
త్యాగ మార్గం
స్వదేశీ మార్గం
రామరాజ్య స్థాపన మార్గం
విశ్వమానవ కళ్యాణ మార్గం

— 'గాంధీ మార్గం' పత్రిక నుండి

# 3వ

## ప్రేమ యనగా నేమి?

నేను ఎన్నో దూరదేశాలు చుట్టి వచ్చాను
ప్రేమంటే యేమిటని ప్రశ్నించాను.
దీనికి జవాబుగా

గులాబీల వికసనమే ప్రేమయని
ఉద్యాన మన్నది
వసంత పర్వమే ప్రేమయని
ఋతువు చెప్పినది

పరిమళయుతము, శాశ్వతము నగు పాటయే ప్రేమయని
కోయిల పలికినది

నదీ ప్రవాహానికై ఆశతో ఎదురుచూచే లిల్లీయే ప్రేమయని
కడలి తెలిపినది

అగ్ని స్వీకారమే ప్రేమయని
జాలరి నుడివినాడు

మన జీవిత సౌరభమే ప్రేమయని
గాయకుడు వచించినాడు

ముసుగులోని సుందర దృశ్యమే ప్రేమయని
చిత్రకారుడు చెప్పినాడు

దైవం ప్రసాదించిన ప్రాణాంతకమైన వరమే ప్రేమయని
ఆలోచనా పరుడైన తాత్త్వికుడు సిర్వచించినాడు

కారాగారాన్ని పుణ్యస్థలంగా భావించే
చిత్రమైన ఆలోచనయే ప్రేమయని
దేశభక్తు డన్నాడు
మంటను చూస్తూ మరణానికి
గురియయ్యే శలభమే ప్రేమయని
సాధువు పలికినాడు

మరణ మాసన్న మైనప్పుడు యౌవనుల
కండగా నుండు రక్షకుని చిరునవ్వే ప్రేమయని
త్యాగి ప్రవచించినాడు
ఎడారి యిసుకలో గానం చేస్తున్న
ప్రపంచం వర్ణించిన సాసై, ఘోరారణ్యంలో మతిబోయిన
దయాడీ మజ్నూలను ప్రేమకు ఉదాహరణగా
కవి వర్ణించినాడు
స్వార్థచింతనుండి తప్పించుటకు స్వామి
తగిలించే సంకెలయే ప్రేమయని
జ్ఞాని ప్రవచించినాడు
అనంతమైన త్యాగంతో సుందర నిర్మాణమును గావించు
కృష్ణ-జీససుల సమ్మేళనమే ప్రేమయని
యోగి విశదీకరించినాడు.

— టి. యస్. వాస్వాని

## 33

# ప్రేమ స్వభావము, ప్రభావము

ప్రేమ అన్ని వేళలందును మిక్కిలి ఉన్నత స్థానమం దుండగోరు చుండును. అది యెట్టి తుచ్ఛము, క్షుద్రము నగు వస్తువుచే బంధింపబడ జాలదు. ప్రేమయొక్క అంతర్దర్శనములో ఆటంకము కలుగకుండుటకు, యెట్టి భౌతికోన్నతిచే గర్వితుడు కాకుండుటకు, దుఃఖముచే పరాజితుడు కాకుండుటకు, సదా స్వతంత్రమగుటకు, ప్రపంచముయొక్క సకల బంధముల నుండి వేరుగ నుండుటకు ప్రేమ అభిలషించుచుండును.

ప్రేమకంటె అధికముగ మధుర మయినది, శక్తివంత మయినది, మనోహర మయినది, ఉత్కృష్ట మయినది మరొక వస్తువు భూమండల మందుగాని, స్వర్గరాజ్యము నందుగాని లేదు. ప్రేమ ఈశ్వరుని నుండి సముద్భూతమైనది, సృష్టింపబడిన సమస్త వస్తువుల కంటె అది సమున్నతమయి, యీశ్వరుని యందు స్థిరముగ పాదుకొని యుండును.

ఎవరి హృదయ మందు ప్రేమ నిత్య నివాసము చేయుచుండునో వారు దైవ బలముచే పై కెగుర గలరు; పరుగిడ గలరు; ఉత్సాహ తరంగములచే నిత్యోల్లసితులు కాగలరు; వారు అనురాగ పూర్ణ స్వాంతులు; స్వతంత్రులు. ప్రేమ తన సర్వస్వమును సమస్త జనులకు దోచిపెట్టును. దానికి సకల వస్తువులయందు సంపూర్ణ ప్రాప్తి సిద్ధించును. దానికి

కారణము సకల వస్తువులకు అతీతుడయి మహోన్నతుడయిన సర్వమంగళాకారునియందు అది ఆశ్రయము నంది యున్నది. అందువలననే ప్రేమనుండి సర్వ విధములగు సుకృతములు, శ్రేయోగుణములు ఉదయించుచున్నవి. ప్రేమకొక పరిమాణము లేదు. అది సకల పరిమాణములకు అతీతము.

ప్రేమ యెట్టి భారమును ఒక భారముగ భావింపదు. కష్టముగ తలంపదు. ప్రేమ తాను బడసిన దానితో తృప్తిపడి, అంతటితో నిలిచిపోనక దానికంటె అధికముగ పొంద గోరును. ప్రేమ తనకు అసాధ్యము, అసంభవము నగు వస్తువే లేదని తలపోయును. అది తాను సకల పదార్థముల కంటె శక్తివంతముగ నున్నట్లు భావించును. సకల విషయములను తనకు ఉచితమని, లభ్యములని తలంచును. కావున సమస్త విషయములందును ప్రేమ బహు బలవత్తర మయినది. ప్రేమ శూన్యుడగు వ్యక్తి ఏ కార్యమందు హతాశుడగుచున్నాడో, ప్రేమ సంపన్నుడు ఆ కార్యమును నిర్వహించుట యందు ఏకాగ్ర చిత్తుడుగ గనబడుచున్నాడు.

ప్రేమ నిత్యము జాగరిత మయి యుండును. నిద్రా కాలమందును అది నిద్రించదు. పరిశ్రమచే శ్రాంతమయ్యు తప్పిపోదు. హతమయ్యు గాయపడదు. భయగ్రస్తమయ్యు హతబుద్ధి కానేరదు. ప్రేమ ప్రజ్వలించుచున్న దీపశిఖ వంటిది. కాగడా వలె మస్తకము కంటె ఎత్తుగ నుండి తేజస్వంత మయి, సకల బాధల మధ్య నిర్విఘ్నముగ వెలుగు చుండు శక్తి ప్రేమకు గలదు.

ప్రేమ తీవ్రమయినది; విశుద్ధ మయినది; కోమల మయినది; ఆనందమయ మయినది; శక్తిమంత మయినది; జ్ఞానమయ మయినది; స్థిరమయినది; మఱి స్వార్థరహిత మయినది. ఎవ్వాని యందు స్వార్థ పరత్వము ప్రవేశించునో అతడు ప్రేమ పదచ్యుతు డగుచున్నాడు.

ప్రేమ సర్వదర్శిష్ట; నమ్రతాగుణ విశిష్ట; సత్యమయి నది. అది దుర్బల మయినది కాదు; పేలవమును గాదు. దానిని సంకుచిత భావములు, సుఖాభిలాషలు ఓడింపజాలవు. ప్రేమ వినీతము; విశుద్ధము, సుస్థిరము, నిర్వివాదము, సమున్నత స్థితి గలదియు నయి మనల పయికెత్తున దగుచున్నది.

ప్రేమ యొక మహత్తరము, మంగళ దాయకము నగు వస్తువు. ప్రేమ వలననే భారవహమగు పదార్థము తేలిక యగుచున్నది. అసహ్యకరమగు విషయము అనాయాసముగ సహించుటకు మనయందు శక్తి నావిర్భవింప జేయుచున్నది. ప్రేమ భరింపరాని భారముగనే కనబడదు. ప్రేమచే తిక్తమగు వస్తువు మధురము, స్వాదిష్టము నగుచున్నది.

— థామస్ ఎ. కెంపిస్

## ౩౪

# ప్రపంచంలో సర్వోత్కృష్టమైనది ప్రేమ

సత్య ప్రేమ జగత్తుయొక్క సారము - అమూల్య పదార్థము. అది పృథ్విని గూడ స్వర్గతుల్య మొనరించుటకై స్వర్గము నుండి ప్రేరేపిత మగుచున్నది. స్వయముగ ప్రేమ స్వరూపుడగు పరమాత్మయే దానిని ప్రేరణ జేయుచున్నాడు మనుష్య ప్రయత్నములచే నది లభ్యమగునది కాదు. వీధుల యందు విక్రయింపబడదు.

పవిత్రత లేనిచోట ప్రేమ లేదు. ఏ ప్రేమయం దాది నుండి యంతము వరకు ప్రత్యంగమునందును బవిత్రత నిండి నిబిడీకృతమై యుండదో యది ప్రేమ కాజాలదు.

పరిశుద్ధమును, పవిత్రమును, భగవ దనుమోదితము నగు ప్రేమను గుర్తింపుము. దానిచే జీవిత సాఫల్య మొదవును.

'అనిర్వచనీయమ్ ప్రేమ స్వరూపమ్'

— నారద భక్తి సూత్రం

ప్రపంచమున ప్రేమ యను పేరుతో కామ మోహములు విక్రయింపబడుచున్నవి. పరిశుద్ధ ప్రేమ ప్రాప్తి చేతనే కామ మోహములు దూర మగును.

ప్రేమయం దీ భావము లంకితములై యుండుట విలోకింతుము: ౧. ఆనందము, ౨. నవీనత, ౩. నిత్యత, ౪. ఉచ్చత ౫. వ్యాపకత, ౬. స్వార్థ హీనత.

ప్రేమ యానందమున దేలియాడు చుండును.

యథార్థప్రేమ యశరీరియగు నాత్మతో సంబంధము గలిగియున్నది. ప్రేమ కాశ్రయము ఆత్మయే కాని శరీరము కాదు. ఆత్మ నిత్యము, శాశ్వతము. ప్రేమయు నిత్యము, శాశ్వతము శరీరముతో క్రీడసలుపు ప్రేమ ప్రేమ కాజాలదు; అది మోహము. మీరు సాధారణార్థమున నుపయోగించు ప్రేమ ప్రేమ కాదు, మోహము.

ప్రేమ యొక్క సర్వ ప్రధాన ధర్మము స్వార్థరాహిత్యము. అది స్వార్థము నెప్పుడు నెరుగదు. అన్యులకై యున్ముక్తమై యున్నది. అది తన గృహంబున వసింపజాలదు. అన్యులకు సేవ సల్పుటయే దాని జీవిత వ్రతము. దానికి సర్వమును స్వీయమే. స్వార్థపరతయు, ప్రేమయు బరస్పర విరోధులు. ప్రేమ యభివృద్ధి నొందిన కొలది స్వార్థపరత నాశన మగుచుండును.

ప్రేమ ప్రతిఫలము నాకాంక్షింపదు. ప్రతిఫలము కాంక్షించునది మోహము.

ప్రేమ యందు గాంభీర్యమున్నది-భయంకరత్వం లేదు
ప్రేమ యందు కౌతుక మున్నది-తరళత లేదు
ప్రేమ యందు ఆవేశ మున్నది-ఉద్వేగము లేదు
ప్రేమ యందు ఉచ్ఛ్వాస మున్నది-ఉద్వేలత లేదు.
ప్రేమ యందు శాసన మున్నది-పేషణము లేదు.
ప్రేమ యందు వివాద మున్నది-విషాదము లేదు
ప్రేమ యందు అభిమాన మున్నది-అవమానము లేదు
ప్రేమ గాంభీర్య భరితమే కాదు, కౌతుక ప్రపూర్ణము కూడను.

ప్రేమ యందు పరిహాసము కలదు, ఆమోదము కలదు, కాని చపలము లేదు.

ప్రేమామోదము తృణము రీతి నత్యల్పమై యెగిరి పోవునది కాదు. దానిపై గాంభీర్యమను బరువు మోపబడి యున్నది.

ప్రేమయొక్క కౌతూహలము తరంగ సదృశము కాదు. దాని యధోభాగమున గాంభీర్య మున్నది.

ప్రేమయందు శాసనము కలదు - పేషణము లేదు, పీడన లేదు.

ప్రేమ దండనమున వికటత్వము లేదు. దోష నాశనమునకై యొక క్షణమునకు బూర్వము దండింపబడిన వారినే మరుక్షణమున నొడియందు గూర్చుండ బెట్టుకొనుచున్నారు. ప్రేమయొక్క శాసన చుంబనములు రెండును సమానములే.

"విత్తి పండించుటకును, సంపత్తి నొసగికొనుటకును, దుర్లభంబయి తనకు 'ప్రేమ' ప్రజలు-రాజులు-నెవ్వరైన భక్తి మీఱ శీర్ష మర్పించి యద్దాని చెందగలరు."

— కబీరు

ప్రేమ శక్తి సముపేతము, సర్వ విజయి, ప్రపంచము లోని సర్వ పదార్థములు చేయనోపని కార్యమును ప్రేమ చేసి చూపగలదు. సర్వశక్తులు పరాజయ మొందిన తావున ప్రేమ విజయము నొందగలదు.

ప్రేమ దుర్బలుని సబలుని జేయుచున్నది. దుష్ట బాలకుని శిష్ట బాలకునిగా నొనరించుచున్నది. మహా పాపిని

పుణ్యాత్మునిగా మార్చుచున్నది. ప్రేమ గల ప్రతి ప్రదేశమున జయజయ ధ్వనులు చెలరేగుట గాంచగలరు.

ప్రేమ సర్వౌషధము—మహౌషధము. స్వర్గమునకు, మర్త్యమునకు ప్రేమయే ఆధారము. సురలోకము - నరలోకము ప్రేమ సూత్రముచేతనే కూర్చబడి యున్నవి. ప్రేమ కంటె మిన్నయగు శక్తిశాలి యగు పదార్థము వేఱొండు కానము.

ప్రేమాస్పదుని దర్శనముచే జిత్తమున నేకాగ్రత యుత్పన్న మగుచున్నది; కర్తవ్య సాధనమున మనోయోగ మభివృద్ధి జెందుచున్నది.

ప్రేమ యమృతమయము. ప్రేమ బుద్ధిని తీక్ష్ణమొనరించుచున్నది.

— ఎమర్సన్

ప్రేమ గుడ్డిదని కొందరు వచింతురు. ప్రేమ యెప్పుడును గ్రుడ్డిది కాదు; కామ మోహములు గ్రుడ్డివి-ప్రేమ చక్షుస్మంతమే. సర్వ చక్షువును, సర్వద్రష్టయు నగు భగవానుడు ప్రేమ స్వరూపుడు.

ప్రేమ ఇచ్చునదేగాని పుచ్చుకొనునది కాదు. అది భోగ స్వప్నం, పిచ్చికోరిక కానేకాదు. అది మంచితనం, ప్రశాంతత, పవిత్ర జీవనం - ఇందులో సందేహం లేదు. ప్రపంచంలో అది సర్వోత్కృష్టమైనది, అచిర కాలం ఉండేది.

— అశ్వినీ కుమారదత్తు

# 3వ

# ప్రేమ బలీయమైన శక్తి

నేటి ప్రపంచానికి కావలసినది పవిత్రము, స్వార్థరహితము నైన దివ్యమగు ప్రేమ. మానవుడు జీవితంలో తన విధిని గుర్తిస్తాడు. ఇతరుల నుండి పుచ్చుకొనుటలో గాక వారికిచ్చుటలోను, పరుల సేవను పొందుటలోగాక వారిని సేవించుటలోను, అన్యుల సౌఖ్యములలో కంటె వారి బాధలలో పాలు పంచుకొనుటలోను నిజమైన ఆనందాన్ని అనుభవిస్తాడు.

ప్రేమ, వివేకము సదా సహాయ ప్రోత్సాహాల నందిస్తాయి తప్ప దండనకు పాల్పడవు.

ప్రేమతప్ప ఆత్మ జ్ఞానానికి సంబంధించిన గ్రంథ పఠనం, అవగాహన నీకంతగా సహాయపడవు. దీనిని పొందుటకు నీవు బుద్ధిని అధిగమించవలసి వుంటుంది.

ప్రేమబంధం గల వా రెన్నటికీ విడిపోరు.

ప్రేమను విస్తరింపజేయ నిర్ణయించుకొన్న వారికి వ్యక్తిగతమైన అంతస్తు, ప్రతిష్ఠలకంటె ప్రేమ, ప్రేమభరితమగు హృదయము ఎక్కువ ముఖ్యమైనవి.

ప్రేమ బలీయమైన శక్తి. ఇది స్వార్థరహితమైన సేవకు అవకాశం కల్పించడమే గాక, దీని నవలంబించే వారిని దేవునిగా రూపొందిస్తుంది.

ప్రేమ గల తావున ఐక్యత ఉంటుంది. అక్కడ ఒక ప్రత్యేక మతమునకుగాని, కులమునకుగాని, పద్ధతికిగాని, ఉచ్చనీచములకు గాని, స్పృశ్యత అస్పృశ్యతా భావమునకుగాని అవకాశ ముండదు.

నీ సౌఖ్యమును వదలుకొనినైనను ఇతరుల సౌఖ్యమును గురించి తరచుగా ఆలోచిస్తూ, వారి సౌఖ్యమునకు పాటుపడాతూ దేవుని ప్రేమించుట కిదియొక మార్గము.

చెట్టుకు కొమ్మల వలెనే ప్రేమకు హృదయపూర్వకమైన భక్తిశ్రద్ధలు, పరిపూర్ణమైన అహింస, లేశమైనను స్వార్థములేని సేవ, ఆశా సంహారణము, ఆత్మ సమర్పణము, వైరాగ్యము, సత్యము అను శాఖలున్నవి.

సర్వ సామాన్యముగా ప్రేమ యను స్వార్థపూరితమైన సంబంధమును సూచించునట్టి దానిని ప్రేమగా భావిస్తాము.

ప్రవిత్రము, యథార్థము, అకలంకమునైన ప్రేమలో మోహపు వాసనాలేశము కూడ ఉండదు. స్త్రీ పురుష వ్యామోహము, అధికార వాంఛ, పేరు ప్రతిష్టలకై ప్రాకులాట, స్వీయ సౌఖ్యముల పట్ల అపేక్ష ప్రేమ యొక్క పవిత్రతను హాని చేస్తాయి.

అన్ని కష్టములను గట్టెక్కించ గల శక్తులలో ప్రేమ శక్తి మిన్నయైనది. దైవ శాసనములో అన్నిటికి మించి అన్ని సమస్యలకు పరిష్కారములను ప్రస్తావించునది ప్రేమ యగుటయే దీనికి కారణము.

ప్రేమ కార్యరంగంలో అత్యంత శక్తివంతమైనది. పరిణామంలో అతి త్వరగా వ్యాప్తిచెందు స్వభావము గలది.

పవిత్రప్రేమ రాజసంలో సాటిలేనిది. శక్తిలో దీనితో సమానమైనది లేదు. ఎంతటి అజ్ఞానాంధకారాన్నైనా యిది నిర్మూలించ గలదు. జీవితాన్ని తేజోవంతం చేయడాని కిది ఆరని జ్యోతి వంటిది.

ప్రేమ తాను బాధల ననుభవిస్తూ ఇతరులకు సౌఖ్యాన్ని ప్రసాదిస్తుంది.

ప్రతిఫలం ఆశించకుండా యితరుల కివ్వడం ప్రేమ యొక్క స్వభావం.

దైవంపట్ల, తోటి మానవులపట్ల ప్రేమ, సేవాసక్తి, త్యాగనిరతి—ఏ రూపంలోగాని ప్రపంచంలో "ఇచ్చి పుచ్చుకునే విధానం"లో ప్రేమ అత్యంత సుందరమైన గుణం.

ప్రేమ అనే వెలుగు త్యాగమనే అగ్నితో కలసి ఉంటుంది. వేడి వెలుగుల వలె ప్రేమ, త్యాగము కలసిమెలసి ఉంటాయి.

ప్రేమ, బలవంతం ఒకే తావున ఉండవు ప్రేమలోపల నుండి సహజంగా వెలువడవలసినదే గాని నిర్బంధం ద్వారా లభించేది కాదు.

సామాన్యమానవుడు అనుదిన జీవితంలో జాతిమత విచక్షత లేకుండా ప్రతి యొక్కరిలో దైవ మున్నాడను భావంతో తన హృదయంలోని భావాలను వెలునరించుటకు మాటలో, ఆలోచనలో, క్రియలో ప్రేమను జోడించవలెను.

సూర్యోదయంతో రాత్రి పగలుగా మారుతుంది. అదే విధంగా ప్రేమ ప్రకటన ద్వారా అజ్ఞానం స్థానాన్ని జ్ఞానం ఆక్రమిస్తుంది.

ప్రేమ, మోహం ఒకటికావు. మోహంలో భేదము, బాధ బలీయంగా ఉంటాయి. ప్రేమలో ఐక్యత, ఆనందం గోచరిస్తాయి. మోహం వ్యయకారి, ప్రేమ ఆనందదాయిని. మోహం యింద్రియ వాంఛలను ప్రేరేపిస్తుంది. ప్రేమ ఆత్మావలోకనాన్ని కలుగజేస్తుంది.

మోహం ఫలాన్ని ఆశిస్తుంది. ప్రేమ ఫలాన్ని అనుభవిస్తుంది. మోహంలో ఉద్రేకం ఉంటుంది. ప్రేమలో ప్రశాంతత ఉంటుంది.

ఒకనిపై పెక్కుర కుండేది మానవ ప్రేమ. పెక్కురలో గల ఒక్కనిపై ఉండేది దివ్య ప్రేమ. మానవ ప్రేమ ద్వారా ఎన్నో చిక్కులు, ఇక్కట్లు కలుగుతాయి. దివ్య ప్రేమలో ఐక్యత, స్వాతంత్ర్యం సిద్ధిస్తాయి.

మన భావాలు, ఉద్వేగాలు మనసులో బయలుదేరతాయి. ప్రేమ హృదయం నుండి వెలువడుతుంది.

ప్రేమ మార్గంలో మానవుడు ధూళిప్రాయుడు అనగా అత్యంత వినయశీలి కావాలి.

— 'Meher Vani' నుండి

## 3౽

# ప్రపంచంలో ప్రధానమైనది ప్రేమ ఒక్కటే

కామమోహాలకు పర్యాయపదంగా ప్రేమను వాడు తున్నారు. ఇవి రెండూ స్వార్థ సంబంధమైనవి. ప్రేమ నిస్వార్థము. ఇది స్వర్గ సంబంధము, దివ్యము.

ప్రేమ అంటే అర్పణ, ఆత్మ సమర్పణ. ఈ ప్రేమ స్వధర్మ నిర్వహణానికి, గృహపాలనానికి, సంఘ సంస్కరణకు, సర్వకళా శోభకు, మానవసేవా నిరతికి, తుదకు మోక్ష ప్రాప్తికి కూడ ఈ ఆత్మవితరణమే, యీ ప్రాణదానమే, యీ ఆత్మ యజ్ఞమే మూలము, సాధనము.

ప్రేమ విశ్వవ్యాప్తియైన సర్వజన సులభ పదార్థము. అందుచేతనే అది ప్రపంచమంతటా వ్యాప్తిగాంచుటకు సదా ఉవ్విళ్లూరుచుండును. దానిలో క్రమవిస్తృతి కలదు. ఒకరు, ఇద్దరు, ముగ్గురు క్రమముగా పదులు, వందలు - యీ రీతిగా ప్రేమాస్వాదుల సంబంధం పెరిగిపోవును. క్రమముగ అది మానవలోక మంతటను వ్యాపించి తుదకు మానవ రాజ్యమును అధిగమించి సమస్త చేతనా చేతన పదార్థము లందును జగన్మయ మగుచున్నది. బుద్ధ భగవానుని ప్రేమ జగన్మయము.

సమస్త పదార్థములను ప్రేమించువారు సాధుపుంగవు లగుదురు. బుద్ధుడు, క్రీస్తు, చైతన్యుడు, మహాత్ముడు, సమస్త దేశములలోని సాధు పుంగవులకును ఇది జపమాల.

ప్రపంచంలో ప్రధానమైనది ప్రేమ ఒక్కటే. ప్రేమ స్పర్శవల్ల కామం త్యాగం అవుతుంది. మనిషి ప్రజలు మాధవు డవుతాడు. నీవు ప్రేమించడం నేర్చుకుంటే నీకు వశు లవుతారు.

"ప్రేమయే దైవం, దైవమే ప్రేమ". — బైబిల్

౩౭

# ప్రేమకు మించిన ధర్మము లేదు

ప్రేమ జీవిత ధర్మము. ప్రేమించుట యనగా ధర్మమును నెరవేర్చుట. ధర్మమును నెరవేర్చుట యనగా శాశ్వత శాంతిని, నిత్యానందమును అనుభవించుట.

ఈ ప్రపంచము ప్రేమనుండి జనించినది. అది ప్రేమ యందు ఉనికిని కలిగియున్నది. అది తుట్టతుదకు ప్రేమ యందు లయించును. ప్రేమ విశ్వ సంభవమునకు శక్తి నొసంగును.

ప్రేమయే జీవితము. ప్రేమయే ఆనందము. ప్రేమయే శక్తి. ప్రేమ హృదయములను, ఆత్మలను బంధించు బంగారు సంకెల వంటిది.

ప్రేమ నిర్మాణాత్మకమైనది, సృజనాత్మకమైనది. ప్రేమ బంధించును. మరియు నిర్మించును. ప్రేమ పునరుద్ధరణకు మూలసూత్రము. ప్రేమ విశ్వాసపాత్రమైన నిజమైన వస్తువు. ప్రత్యక్షముగా వ్యక్తమగు పదార్థమే ప్రేమ. వైజ్ఞానిక తులనతో ప్రేమ సూత్రమును పాటించువాడు అనేక అద్భుతముల నొనర్చ గలుగును. ఆధునిక వైజ్ఞానికశాస్త్రము లన్నిటికంటె ప్రేమధర్మమే గొప్పది. ప్రేమ ధర్మము. సాధువుల యందు, సత్పురుషులయందు విస్తరించి యుండును.

జీవించుటయే ప్రేమించుట. ప్రేమించుటయే జీవించుట. నీవు పాఠమును నేర్చుకొనుటకు జీవింపవలయును. నీవు

శాశ్వతత్వమునందు జీవించు పాఠమును నేర్చుకొనుటకు ప్రేమించవలయును. విశ్వాసము, ప్రేమ, భక్తిలేని జీవితము వ్యర్థము; నిజమైన మృత్యువు.

ప్రేమకు మించిన ధర్మము లేదు. ప్రేమకు మించిన ధనాగారము లేదు. ప్రేమకు మించిన జ్ఞానము లేదు. ప్రేమకు మించిన పుణ్యములేదు. ప్రేమకుమించిన మతము లేదు. ప్రేమయే సత్యము. ప్రేమయే దైవము. ప్రేమ స్వరూపుడే దేవుడు. అతని సృష్టిలోని ప్రతి అణువు నందు నీవు అతని ప్రేమను అర్థమొనర్చుకొన గలుగుదువు.

సత్యము లేక దైవ సామ్రాజ్యమునకు ప్రేమయే దగ్గర దారి. అది సృష్టి సర్వస్వమునకు మూతము వంటిది. అది ఆత్మ శక్తియొక్క ఉన్నతోన్నత దశను వ్యక్త మొనర్చును. మత ధర్మము లన్నింటి కలయికయే అది. ప్రపంచ మంతటిని జయించుటకు అది భక్తుని చేతిలోని మంత్రదండము వంటిది.

## మోహము - శుద్ధప్రేమ

దేహము లేక చర్మముపై గల ప్రేమయే మోహము. దేవునిపై గల ప్రేమయే భక్తి. ఇది శుద్ధమైన ప్రేమ. ఇది ప్రేమ కొరకు ప్రేమించు ప్రేమ.

స్వార్థలాభమును బడయుటకై ఇతరులను ప్రేమించుట స్వార్థప్రేమ యనబడును. ఇది నిన్ను ఈ భూలోకము నందు బంధించును. దైవ సృష్టియందున్న జీవులందరినీ నారాయణ భావముతో ప్రేమించుట శుద్ధ ప్రేమయనబడును. ఇదియే దివ్యమైన ప్రేమ. ఇది ముక్తికి కారణ మగును.

ప్రతి భౌతిక ప్రేమయందు పొల్లుదనము, విరోధము, సంశయము, దోషము దాగియున్నవి. కాని నిజమైన శుద్ధ ప్రేమయందు సంపద, గంభీరత, పూర్ణత, నిర్దోషత యుండును. అది శాశ్వతమైనది. మార్పులేనిది. అనంతమైనది.

స్వార్థపూరితమైన మోహము ఇతరులయొక్క పొగడ్త నాశించును. కాని శుద్ధమైన దివ్యప్రేమ ప్రియుని సంతోష పెట్ట జూచును. మరియు ప్రియుని ఆనందముచే తాను ఆనందము పొందుటకు యత్నించును. త్యాగమే ప్రేమ. ప్రేమించుట యనగా పంచుకొనుట, సేవించుట.

ప్రేమను వ్యక్తమొనర్చుటయే సేవ. సేవ, దానము, ఔదార్యము, ఉపకార రూపములందు ప్రేమ వ్యక్తమగును.

ఉపకార బుద్ధి వ్యక్తమైనప్పుడు 'దయ' యని చెప్పబడును. అది ప్రేమయొక్క ప్రత్యక్షవ్యక్తీకరణము. అహింస ప్రేమయొక్క పరోక్ష వ్యక్తీకరణము.

కేవలము నిష్క్రియమైన మంచితనం పనికిరాదు. ఆధ్యాత్మిక ప్రగతికై క్రియాశీలమైన మంచితనము మిక్కిలి ఆవశ్యకమై యున్నది. కావున సాధకు లెల్లప్పుడు సత్కార్యముల నొనర్చుచుండ వలయును.

సేవాభావము నీ యందు నాట బడవలయును. సేవాభావము నీకు స్వగతమై, స్వాభావికము కావలయును. అది కేవలము ప్రదర్శనగా నుండరాదు. ప్రేమ, ఔదార్యము, విశ్వాసపాత్రత, భావపూర్ణత లేని సేవయంతయు వ్యర్థము.

ప్రేమ భావముతో నీవు సేవించినచో, దేవుడు నీ వెనుక నే యుండును.

సేవించుము. ప్రేమించుము. దాన మొసంగుము. ఈ సూత్రముల నభ్యసించువాడు కష్ట సమయములలో క్లిష్ట వేళలలో అమానుషమగు ఆశాకిరణముచే ప్రేరేపింపబడి సుఖజీవను డగును.

## విశ్వప్రేమ

బీదవారిని, హీనజాతివారిని, బాధయందున్న వారిని పూజింపుము. వీరే నీ దేవతలు. వీరే నీ మొదటి దేవతలు.

అందరినీ ప్రేమింపుము. దానిచే లక్ష యజ్ఞములు, తపస్సులు, వ్రతములు చేసిన ఫలితము నీకు లభించును. నీ పొరుగింటి వారి ఆనందమే నీ ఆనందముగా, అతని దుఃఖమే నీ దుఃఖముగా భావించుము.

మానవు డొకడే. దేవు డొకడే. ప్రేమ ఒకటే. ధర్మ మొకటే. దైవసాక్షాత్కార మొకటే. మన మందరము ఒకే వృక్షము యొక్క ఫలములు, ఒకే శాఖయొక్క ఆకుల వంటి వారము. అప్పుడు నూతనుడెవ్వడు లేడు ప్రతి ఒకడు వికాస క్రమమునందున్న దేవుడే.

జీవించియున్న ప్రతి వస్తువుతో నీవు తాదాత్మ్యము నొందుము. శత్రువుతోను, మిత్రునితోను శాంతిగా జీవించుము.

మనుష్యులందరు ఒకే శరీరముయొక్క అంగముల వంటి వారు. సృష్టియంతయు దేవుని కుటుంబము. దేవుని సృష్టి సంతటిని ప్రేమించుము. పశువులను, పక్షులను, మొక్కలను, పత్రములను, ప్రతివస్తువును ప్రేమింపుము. వాటిన్నిటి యందున్న రహస్యమును తెలిసికొనుట కిది మార్గము.

సర్వసమైక్యమైయున్న విశ్వాలింగనమే విశ్వ ప్రేమ యనబడును. శుద్ధ ప్రేమ యందు అలింగనా వలయమును దాటినవాడు లేడు.

## నేటి అత్యావశ్యక విషయము

ద్వేషముచే ద్వేషము ప్రబలును. ప్రేమచే ప్రేమ జనించును. భయముచే భయముత్పన్న మగును. ఇది స్థిరమైన మానసిక సిద్ధాంతము. దౌష్ట్య ద్వేషముల బలమునణచి పృథ్వియందు వ్యాపించు దైవశక్తి స్వాభావికమైన ప్రేమ ధర్మమే.

ప్రేమయందే జీవులందరి ముక్తి నిబిడీకృతమై యున్నది. అంధకారము, విచారముతో కూడిన ప్రపంచమందు ప్రేమయే ఆశాకిరణమై యున్నది. కరుణ, సహకారము, ప్రేమ, త్యాగము, దయ, ఓర్పులను కలిగియున్న నాయకులు ఈ ప్రపంచమున కవసరమై యున్నారు. ఈ విశ్వప్రేమ నభ్యసించుటచే వ్యక్తియొక్క ఆధ్యాత్మిక ప్రగతి, సాంఘిక క్షేమము, విశ్వశాంతి చేకూరును. కావున కార్యరంగము నందడుగిడి ఈ విశ్వప్రేమ సందేశమును ప్రపంచమంతటను వెదజల్లుము.

ప్రపంచములోని సాధువులు, సత్పురుషులు. అవతార పురుషులు ప్రేమయే జీవిత లక్ష్యమని నుడివియున్నారు. వారి ప్రబోధములచే ప్రేరణను పొందుడు.

ప్రేమయందు జీవించుము. ప్రేమ యందు శ్వాసించుము. ప్రేమ యందు గానమొనర్పుము. ప్రేమ యందు భుజింపుము. ప్రేమ యందు పానమొనర్పుము. ప్రేమ యందు మాట్లాడుము. ప్రేమయందు ప్రార్థించుము. ప్రేమ యందు ధ్యానించుము. ప్రేమ యందు ఆలోచించుము. ప్రేమయందు చలించుము. ప్రేమ యందు మరణించుము. ప్రేమాగ్ని యందు నీ మనోవాక్కాయములను శుద్ధమొనర్పుము. పవిత్రమైన ప్రేమ సాగరమునందు మునక వేసి స్నానము చేయుము. ప్రేమపీయూషమును పానమొనర్చి ప్రేమ స్వరూపుడవగుము.

— 'ప్రేమ' గ్రంథము నుండి

# ३०

# ప్రేమయే అమరజీవన తత్త్వము

నమ్రతవలన శాంతము, త్యాగము వలన ధైర్యము మఱి వివేకము, ప్రేమవలన ఆనందము మఱి భ్రాతృభావము, దయవలన వినయము మఱిక్షమ మనకు లభించు అమూల్య మణులు.

నమ్రత, త్యాగము, ప్రేమ, దయ ఈ నాలుకు సద్గుణములను గలిగియున్న వ్యక్తికి ఈశ్వరీయ దివ్యప్రకాశము లభ్యమగుచున్నది... ఎల్లరిని నిష్కపటముగ ప్రేమించుటయే అతని దైనందిన ఆలోచనా కార్యక్రమము.

ప్రేమయే జ్ఞానము. ప్రేమయే శక్తి. ప్రేమించుట తెలిసినవాడు ఆపదలను దూరమొనరించుకొనగలడు. విఫలతను సఫలతగా పరిణమింపజేసికొనగలడు. దుఃఖమయ పరిస్థితులను సుఖమయ పరిస్థితులుగ మార్పు చేసుకొనగలడు.

ప్రేమలేనిదే మనుష్యుని జీవితము నిరర్థకమని మహాత్ముడగు జీసస తన జీవితములో ప్రజలను ప్రేమించి చూపించినాడు... స్వార్థ రహితుడు, ఇతరుల యెడ సహానుభూతి కలవాడు వీరిద్దరును ఈశ్వరీయ ప్రకాశమును బడయ నర్హులు. ద్వేషముగల చోట ప్రేమకు తావులేదు. ప్రేమయే ప్రేమను తెలుసుకొనగలుగుచున్నది. మఱి అందు మిళితమయి పోగలదు. మనుష్యుడు పవిత్రుడుగ నుండును. వానిలో ప్రేమ తత్త్వముండును. తన స్వార్థమును పరిత్యజించి

మహాత్ముడగు జీససు యొక్క తత్త్వమును గ్రహించిన సమయమున మనుష్యుడీ యనుభవమును బడయుచున్నాడు.

ఏ మహాపురుషుని మహోపదేశముగాని, ధర్మశాస్త్రముగాని ప్రేమకు సాటికాజాలవు. మనుష్య మాత్రుల యందు ప్రకటింపబడు నొక దివ్య వస్తువే ప్రేమ. నీతిమంతుని నీతిహీనుని, న్యాయశీలుని, అన్యాయపరుని, స్పృశ్యుని అస్పృశ్యుని ఎల్లరిని చల్లని చూడ్కుల కౌగిలించుకొను దివ్యపదార్థమే ప్రేమ. సకలభూతజాలము పయి ప్రేమను వర్షించువాని మతమే సమ్మతము. అట్టి ధర్మమే సద్ధర్మము. అట్టి ప్రేమ మూర్తియే బుద్ధిమంతుడు మఱి దూరదర్శి.

ప్రేమయే మన అమర జీవన తత్త్వము. ఇది పరమ సత్యము. జగడములను, నిరంతర పరినిందలను, దుర్భావములను పరిత్యజించుటచే మనకు ప్రేమ లభ్యమగుచున్నది. ఈ అవగుణములను తమనుండి పారద్రోలని వారు ప్రేమించుట తమకు తూర్ణముగ తెలియుననుట వట్టి బూటకము. అవగుణములచే నలముకొన్న యెడదలో నిది పొడచూపుట కల్ల. సద్గుణ సంపన్నులమైనంతనే మనకు ప్రేమపై స్వత్వము కలుగగలదు. ప్రేమయొక్క కపటనాటకము నాడుచున్నంతవఱకు మనము దాని కధికారులము కాజాలము. ప్రేమోపాసకులము, ప్రేమమూర్తులము కాదలంతుమేని మనము మన సహచరుల యెడల దుర్భావములను కలిగియుండరాదు. వారియెడ ఉదార భావముల గలిగియుండవలయును, వారొనరించు సమస్త కార్యకలాపములను ఉదాత్త బుద్ధితో విశాల దృష్టితో వీక్షింపనగును. వారి భావములు మన

భావములకు భిన్నములయినను, వారియందలి దోషములను రోయరాదు. కినుక బూనరాదు. వారు క్షమార్హులు. మనమీ చందమున వారిని ప్రేమించ గలుగుదుమేని సాధు సత్తముడగు పాల్ నుడివినట్లు ఈ ప్రేమను ఒక శాశ్వత నిత్య వస్తువుగ మన్నించినవారము కాగలము.

స్వభావతః ప్రేమ ఏ మతమునకు జెందినదికాదు. ఏ సంప్రదాయము యొక్క పిత్రీయమునుగాదు. తమ మతము నందే ప్రేమ కలదనియు, అన్యమతములందు ప్రేమ లేదనియు ననువారు ప్రేమను సరిగ అర్థము చేసికొననివారే. ప్రేమయే మనుష్యుని జీవనము. అది వివిధ రూపములందు, అనేక మతములందు, ధర్మములందు లభ్యమగుచున్నది. అది ప్రత్యేకముగ నేదేని యొక మతమందు నిబద్ధమయియున్నదనుట వెఱ్ఱిమాటే కల్ల. అదియొక రెక్కలుగల ప్రేమ దూత. దానిని మతముగాని సంప్రదాయముగాని పట్టి బంధింపజాలదు. ఏ మహాపురుషుని మహోపదేశముగాని, దర్శనశాస్త్రముగాని ప్రేమకు సాటిరాజాలవు. మనుష్యమాత్రుని యందు ప్రకటింపబడు నొక దివ్య వస్తువే ప్రేమ. నీతి మంతుని, నీతి హీనుని, న్యాయశీలుని, అన్యాయపరుని, స్పృశ్యుని, అస్పృశ్యుని ఎల్లరిని చల్లని చూపులచే కౌగిలించుకొను దివ్య పదార్థమే ప్రేమ. సకలభూతముల పయి ప్రేమను వర్షించు వాని మతమే సమ్మతము. అట్టి ధర్మమే సద్ధర్మము. అట్టి ప్రేమమూర్తియే బుద్ధిమంతుడు.

జనులు నిన్ను నిందించినను, నీయెడ అనుచితముగ వర్తించినను చెడుగ దలంచకుము. ద్వేషమును ద్వేషముతో

ఎదుర్కొన గోరకుము. ద్వేషమును ప్రేమతో జయించుము. ఎవరేని నిన్ను ద్వేషించుచున్న యెడల దీనికేదియో కారణము కలదని తెలుసుకొనుము. అతనియెడ నీవు నడచిన నడత వలనగాని, తెలిసియో తెలియకయో అతనిపట్ల నీవే దేని తప్పు గావించుట వలనగాని నిన్ను ద్వేషింప గడంగ వచ్చును. ఆపుడు నీవు ప్రేమ పురస్సరముగ వానిని గలిసి, నీ స్థితిని వానికి దెలియజెప్పి, అతని ద్వేష భావమును తొలగింప వచ్చును. అతనితో ప్రతి దశయందును నీ సంబంధమును త్రెంచుకొనుట కంటె అతని క్షేమమునకయి ఈశ్వరుని ప్రార్థించుట ఎన్నియో మడుంగు లుత్తమము. ద్వేషము కడుంగడు తుచ్ఛము, సంకుచితము మరి దుఃఖదాయకము ప్రేమ మిక్కిలి సమున్నతము, సువిశాలము, సుఖప్రదము.

— 'శాంతిపథము' నుండి

## 3

# ప్రేమే జీవిత సారం

ప్రే మే జీవిత సారం పరమార్థం
పెందరాడే పనికి పోవడం
సందెవేళ యింట వాలడం
తినడం, ఆడడం, పాడడం, ముద్దాడడం
నవ్వులూ, ఏడ్పులూ - యివన్నీ
ప్రేమ వల్లనే, ప్రేమ వల్లనే

మానవలోకానికి మూలబలం ప్రేమ
ఇల్లుకట్టినా, భ్రుపమండలం మెట్టినా
అణువులను అనువుగా మచ్చిక చేసుకున్నా
చుక్కలపైకి రాకెట్లు ఎక్కుపెట్టినా
సముద్రం అట్టడుగుకు దూసుకు వెళ్లినా
బలం, ప్రోద్బలం ప్రేమే, ప్రేమే

భూమి, మనిషి పుట్టిన నాటి నుండి
తొలిమనిషి అవతరించిన నాటి నుండి
సృష్టిలో తొలిదినం నుండి
లోకాన్ని తిప్పేది ప్రేమ

సూర్యుడు వెలిగే వరకూ
గాలి వీచే వరకూ
ప్రపంచానికి పునాది ప్రేమ

మన రక్తంలో కుతకుతలాడి
ప్రేమ మనల్ని రోదసిలోకి పంపింది
ప్రేమలేక కట్టలేము గుడిసెనైనా
ప్రేమలేక తీయలేము కూనిరాగమైనా
లోకంలోని సమస్తాన్ని
ఉద్యానవనాల్ని, విద్యుత్ కర్మాగారాల్ని
వాని అందచందా లన్నిట్నీ
ప్రేమచేత కట్టాయి మనిషి చేతులు
ప్రేమకు అల్లారు ముద్దుబిడ్డ మనిషి
ద్వేషం అనాకారి, దానికి ఫలితం శూన్యం
కల్లోల ప్రపంచపు సకల సంపదా
ప్రేమ చేతి చలువ
ప్రేమ తొలగితే, లోకం బూడిద
చెమటోడ్చి మనిషి చేసిన సృష్టి
యుద్ధంలో ఆద్యంతమూ నష్టి
కాని బ్రతుకు సాగుతూనే వుంటుంది
ధర్మం వెలుగుతూనే వుంటుంది
కుత్రరతరహా ప్రపంచం
రోజురోజుకు పండబారుతోంది
ప్రేమే జయిస్తుంది ద్వేషాన్ని
మనిషి జీవిస్తూ నేర్చుకుంటాడు
ఉన్మాదం మళ్లుతుంది వెనక్కి
ధర్మం వెళ్లుతుంది ముందుకి

— 'గ్రంథాలయ సర్వస్వము' 1965 జనవరి సంచిక నుండి

## ౪౦

# జీవులలో ప్రేమ దివ్యమైన లక్షణం

ప్రేమ విశ్వవ్యాప్తమైనది. జీవితంలో అన్ని స్థాయిల లోను ప్రేమ కనిపిస్తుంది. రమణీయమైన భౌతిక స్థాయిలో ఇది మోహంగా ప్రత్యక్ష మవుతుంది.

స్త్రీ, పురుషుల పరస్పరాకర్షణలో ఇది అసూయను కలిగిస్తుంది. శరీరంలో విషాన్ని ప్రవేశపెడుతుంది. క్రమ భంగానికి దారితీస్తుంది. మనసును కప్పివేస్తుంది.

పవిత్రమైన ప్రేమ నిర్మాణాత్మకంగా ఉంటుంది. అది సదా వితరణ చేస్తూ వుంటుంది తప్ప ఎన్నడూ స్వీకరించదు.

ప్రేమ భీతిని దరిజేరనీయదు. దీని అనుష్ఠాత దివ్యత్వాన్ని పొందుతాడు.

ప్రేమ జీవితాన్ని మనోహరంగా మారుస్తుంది. ఆటంకాలను అధిగమిస్తుంది. కుటుంబాన్ని త్యాగం చేస్తుంది. ప్రపంచాన్ని ఏకం చేస్తుంది. వికృతాన్ని సుందరంగా తీర్చి దిద్దుతుంది. నరకాన్ని స్వర్గంగా మారుస్తుంది.

జీవులలో ప్రేమ దివ్యమైన లక్షణం. ప్రతి జీవిలోను ఇది సహజంగా ఉంటుంది. దీనికి విరుద్ధమైన లక్షణం ఏ జీవిలోనూ కానరాదు. ప్రేమ సాధకుడు జీవితాన్ని చరితార్థం చేసుకుంటాడు.

కొందరిని ప్రేమిస్తూ, కొందరి విషయంలో ఉదాసినత వహిస్తూ, మరి కొందరిని ద్వేషించడం మానవు లందరిలోనూ సహజంగా ఉండే లక్షణం. బహు కొద్దిమంది ద్వేషాన్ని వర్జించి ప్రేమను అవలంబిస్తారు. వారికి జీవులన్నీ పవిత్ర మైనవే. వారు సృష్టినంతటినీ ఆరాధిస్తారు. వారు లోకాన్ని సారవంతం చేస్తారు.

— స్వామి చిద్భవనానంద

౪౧

# జీవిత ధర్మము

బ్రతుకు సమస్తము కలల పరంపర. ఏమనగా తెలిసియే కలలు గనుచుందుము.

దుఃఖమే గురువుగా నుండు పాఠశాల యీ జీవితము. మహాత్ములును, ప్రవక్తలును పాఠములు నేర్చుకొను పాఠశాల యిది. సానుభూతిని కఱపునట్టి, ఓర్పును నేర్పునట్టి పాఠశాల. మనము పాద మూనుకొని యుండు విశ్వం బ్రద్దలై నప్పటికిని చలింపని, సడలని సంకల్పమును మన కలవరచు పాఠశాల.

అస్వార్థపరుడ వగుటకును, పరిశుద్ధుడ వగుట కొరకును ప్రయత్నింపుము. అదే ధర్మ సర్వస్వము.

ఇతరుల కొరకు జీవించువారే సజీవులు. తక్కిన వారు ప్రాణములతో నుండియు చచ్చిన వారి క్రింద లెక్కింపదగిన వారు.

లోకాన మతములు ప్రాణములేని వెక్కిరింతలయి పోయినవి. లోకమునకు శీల మవసరము. నిస్స్వార్థ జాజ్వల్యమాన ప్రేమమయ జీవనులను ఈ లోక మపేక్షించుచున్నది. అట్టి ప్రేమ ప్రతిమాటను పిడుగువలె అమోఘమైనదిగ చేయును.

దివ్యత్వము మానవునియం దుండనే యున్నది. దాని నావిష్కరించుటే ధర్మము.

ఒరులను ద్వేషించిన వారికి అధఃపతనము తప్పదు. ఇది నైతిక ధర్మము.

ఇచ్చి పుచ్చుకొనుట ధర్మము.
వికాసమే జీవితము. సంకోచమే మరణము.
ప్రేమయే జీవితము. ద్వేషమే మరణం.

వశీకరించుకొనునది ప్రేమయే కాని బుద్ధికాదు. పాండిత్యము, యోగము, ధ్యానము, జ్ఞానము అన్నియు ప్రేమతో పోల్చిన ధూళియు, దుమారమే. ప్రేమ నీకు అనిమానుష శక్తుల నొసంగునది. ప్రేమ నీకు భక్తి నొసంగునది. ప్రేమయే నీకు మోక్ష మార్గము చూపునది. నిజముగా ఇది పూజ; మానుష దేహ దేవాలయమున నుండు ప్రభుని యారాధన.

దేనినైనను ఒకదానిని నిస్వార్థముగ ప్రేమింప నేర్చుకొన్నవారికి క్రమ క్రమముగ విశ్వప్రేమ అలవడుననెడి ఆన పాటు కలదు.

అందరియెడ సమానమైన ప్రేమ కలిగియుండుట నిజముగా దుర్ఘటమే. మరి అట్లులేకున్న ముక్తిలేదు.

చలింపని ప్రేమ, సమగ్ర నిస్వార్థత - ఇవి అన్నిటిని జయించును.

అందరికిని మేలు చేయుము. ప్రతి వానిని ప్రేమింపుము. కాని ఎవరి మీదను వ్యామోహము గొనకుము. అది ప్రతిబంధకము. ప్రతి బంధకము కేవలము దుఃఖమును కలిగించును.

ఈ జీవితమున ఎట్లయినను, ఎంత కష్ట నష్టములు పడి యైనను పొందవలసినది, దక్కించుకొనవలసినది, అన్నిటికిని మూలమైనది ప్రేమ ఒక్కటే- ప్రేమ, మిక్కిలియైన ప్రేమ. కడలేని ప్రేమ, ఆకాశమువలె విశాలమైన ప్రేమ, సముద్రము వలె అగాధమైన ప్రేమ; ఇది యొక్కటే జీవితమున లాభము. దీనిని సాధించినవాడు ధన్యుడు.

ప్రేమ, ఆర్జవము, శాంతి - ఇవి తప్ప వేరేదియు నక్కరలేదు. జీవిత మనగా అభివృద్ధియే, వికాసమే, ప్రేమయే కాక మరేమి? కావున సకల విధ ప్రేమయే జీవితము. అదొక్కటే జీవిత ధర్మము. అన్ని విధములైన స్వార్థపరతయు మరణమే. ఇది యిప్పుడును సత్యమే, ఇకమీదను సత్యమే.

ఇతరులకు మేలుచేయుటే జీవితము. మేలు చేయ కూడుటే మరణము. మీరు చూచు నర పశువులలో నూటికి తొంబదిమంది చచ్చినవారే, పిశాచములే. ఏలయన ప్రేమగలవారే బ్రతికియున్నవారు.

ప్రేమ యెన్నడును వమ్ముకాదోయి. నేడుగాని, రేపు గాని, యుగములు గడచిన వెనుకగాని నిజము నెగ్గితీరును. ప్రేమ గెల్పొంది తీరును. తోడి మానవులపై నీకు ప్రేమ యున్నదా! దేవునన్వేషించుటకై ఎచటికి పోవలెను? ఈ పేద లును, ఈ దుఃఖితులును, ఈ దుర్బలులును దైవములు కారా? ముందుగ వీరినేల ఆరాధింపరాదు? గంగగట్టున బావి త్రవ్వ నేల? ప్రేమకుగల సర్వతోముఖమైన శక్తియందు నమ్మకము కలిగియుండుడు.

నీకు ప్రేమయున్నదా? ఉన్నచో నీవు సర్వశక్తివి. నీలో సమగ్ర నిస్వార్థత కలదా? ఉన్నచో నీవు అప్రధృష్యుడవు.

పవిత్రప్రేమకు స్పర్ధ ఉండదు. దీని కుదాహరణ ప్రేమికుల ప్రేమగాదు. తల్లికి బిడ్డపైగల ప్రేమ.

పవిత్రప్రేమలో భయానికి తావులేదు. దీని కుదాహరణ తల్లి తన బిడ్డను రక్షించుకొనుటలో ఎంతటి విపత్తునైనా ఎదుర్కొంటుంది.

పవిత్రప్రేమలో కోరిక ఉండదు. నిజమైన మిత్రుడు తన చెలికాని నిమిత్తం చేసే త్యాగం దీని కుదాహరణ.

నా వత్సలారా! సానుభూతిని కలిగియుండుడు. పేదల పట్ల, అజ్ఞులపట్ల, అధఃపతితుల పట్ల అనుక్రోశము కలిగియుండుడు. ఎంతటి అనుక్రోశ మనగా మీ గుండె ఆగిపోవలెను తల తిరుగవలెను. వెర్రెత్తునని మీకు తోపవలెను. తర్వాత మీ హృదయ పరీవాహమును భగవంతుని చరణముల వంకకు కురియింపుడు. అప్పుడు శక్తియు, సహాయమును, అజేయమైన బలమును కలుగును.

పాటుపడుడు, పాటుపడుడు. ఇదే నా మంత్రము. జగద్ధితమునకు పాటుపడుటయే జీవితము.

కోట్లకొలది అధఃపతితుల., శ్రమజీవుల హృదయ రక్తము నొలికించి తాను చదువులు చదివి భోగము లనుభవించుచు., ఆ పేదలను గూర్చి తలంపనైన తలంపకుండువారిని 'ద్రోహి' అని నే నందును.

దేశమనగా కొన్ని వేలమంది విశ్వవిద్యాలయాల పట్ట భద్రులు మాత్రమే కాదు. దేశమనగా సంపన్నులగు ఏ కొందరు మాత్రమే కాదు. మన ప్రజలలో నూటికి తొంబండు గురు విద్యావిహీనులు. వారి నిరక్షరాస్యతను గూర్చి దేశ భక్తు లనుకొనబడు మన బాబులలో తలంచుకొను వా రెవరు?

ఏకైక మార్గము సహానుభూతియు, ప్రేమయు నే. ఏకైకారాధనము ప్రేమయే.

'మాతృదేవోభవ', 'పితృదేవోభవ' అను వాక్యములు మీరు చదివినవే. 'దరిద్ర దేవోభవ', 'మూర్ఖదేవోభవ' అని నే నందును. పేదలు, నిరక్షరాస్యులు, అజ్ఞులు, బాధి తులు వీరే మీ దైవము లగుదురుగాక! వీరి సేవయే మహో న్నత ధర్మమని తెలిసికొనుడు.

ప్రతి బానిస జాతికిని ప్రధాన దోషము ఈర్ష్య. దాస్యమును పుట్టించునదియు, స్థిర పరచునదియు ఈ యీర్ష్యయు,అనైక మత్యము లే.

కామము, అజ్ఞానము, వైషమ్యము ఇవి దాస్య త్రిపుటి. బ్రతికియుండ మను సంకల్పమురు విడనాడుట, జ్ఞానము, సమ దృష్టి - ఇవి మోక్ష త్రిపుటి.

విశ్వమునకు లక్ష్యము విముక్తియే.

ఏ ఘన కార్యములుగాని మోసముచే సాధింపజాలము. ప్రేమయు, సత్యాభి నిరతియు, అత్యధిక శక్తియు—ఇవే సర్వ కార్య సాధకములు. 'తత్ కురు పౌరుషమ్' కనుక పౌరుషము నెఱపుము.

ఎవరితోగాని వాదింపవలసిన, కలహింపవలసిన అక్కర లేదు. మీ సందేశమును అందింపుడు. ఇతరులను వారి ఆశయములకు విడిచిపెట్టుడు. 'సత్యమేవ జయతే నానృతమ్' గెల్చునది సత్యమే గాని అసత్యము కాదు. 'తదా కిం వివాదేన' అప్పుడు వివాద మెందుకు?

గాంభీర్యమును, శిశుసహజమైన అమాయికతను మేళవింపుడు. అందరితో సామరస్యము కలిగి జీవింపుడు. అహంకారాశయములను పూర్తిగా విడిచిపెట్టుడు. వర్గీయ భావముల నుంచుకొనకుడు.

ఏ దేశమునకుగాని; ఏ మానవునికి గాని గొప్పతనము కలుగవలెననిన అందుకు మూడు విషయములు అపేక్షితములు.

1. సౌజన్య శక్తులందు దృఢ విశ్వాసము.
2. ఈర్ష్య, అనుమానము లేకుండుట.
3. మంచి చేయవలెననియు, మంచిగ నుండవలెననియు ప్రయత్నించు వారికెల్ల తోడ్పడుట.

— స్వామి వివేకానంద

## ౪౨

## కొన్ని సూక్తులు

ఏవాడు జీవింప ననేకులు జీవింతురు, వాని మనుగడయే సఫలము. వాడొకడు జీవించువాడు.

పురుషార్థం బర్థించువారి కవశ్యాచరణీయంబులగు ధర్మంబులు వినుము. సకల దోషంబులకు మూలంబయిన లోభంబు విసర్జింపవలయును. సర్వ భూతంబుల యందు సదయుండయి యుండవలయును. ఆ లోభంబును, భూత దయయును లేనివానికి సర్వ ధర్మంబు లనుష్ఠితంబు లయ్యు విరర్థకంబులగు. జీవితంబు క్షణభంగురంబు గావున మోసపోక పురుషుండు కాలంబు పుచ్చక యుత్తమ ధర్మంబు లనుష్ఠించవలయును.

శరణాగత రక్షణంబు సర్వధర్మంబులం దుత్తమంబని ధర్మవిదులు వక్కాణింతురు.

శరీర రక్షణంబు పరమ ధర్మంబు. శరీరంబు గలిగిన నెల్ల ధర్మంబుల సాధింపవచ్చు. 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధన'మ్మని ప్రాజ్ఞులు వక్కాణింతురు.

— చిన్నయసూరి

జీవితం కూడబెట్టడానికి కాదు. ఉన్నదంతా ఇతరులకు ఆనందంగా ప్రేమపూర్వకంగా ఇచ్చివేయడానికే.

అందరిలోనూ గల సౌందర్యాన్ని తిలకించ ప్రారంభించినప్పుడు జీవితం ఆనందంగా ఉంటుంది.

ఇతరులలోని దోషాలను, వికారాలను చూచినప్పుడు జీవితం దుర్భర మవుతుంది.

సదా మనం ఇతరుల దోషాలను ఎంచుతూ వుంటాము. అలా కాక ఎల్లప్పుడూ నీ తప్పును కనుగొని దానిని తొలగించుటకు ప్రయత్నించిన యెడల జీవితం సాఫీగా నడుస్తుంది.

— టి. యల్. వాస్వాని

మానవ జీవిత పరమార్థం గొప్పతనాన్ని, సుసంపన్నతను, ఖ్యాతినీ పొందడం కాదు, ఆత్మను పదిలపరచుకోవడమే.

— టాల్‌స్టాయ్

నిర్మల జీవితము మనుష్యుని సమున్నతుని గావించును. అనేక విషయము లందు అట్టి పరిశుద్ధ జీవితము మనుజుని విశేషజ్ఞుని గావించును.

ధర్మ గ్రంథము లందు మనము చూడవలసినది భాషా సౌష్ఠవము, కావ్యశిల్పము గాదు. మరి మానవ కల్యాణము, మానవ ప్రయోజనమును గురించిన అన్వేషణము, పరిశోధనము ఆ గ్రంథములందు గావించు టుచితము

పవిత్ర చరిత్రుల నడవడి యందెట్టి మచ్చలేక తమ జీవితయాత్రను సమాప్త మొనరించుకొనిన వ్యక్తులు ధన్యులు.

— థామస్ ఎ. కెంపిస్

ప్రపంచములో సంపదగాని, ప్రాణము గాని స్థిరములు గావు. ఒక్క ధర్మము మాత్రమే నిత్యమైనది.

— భర్తృహరి

ధర్మ మాచరించుటచే ధనము కలుగును. ధర్మ ప్రవర్తనచే సుఖము గలుగును. ధర్మము చేతనే సకలమును గలుగుచున్నది. కావున నీ ప్రపంచ మందు ధర్మమే ముఖ్యమైనది.

— వాల్మీకి

ధర్మము జ్ఞాన చోదితమైనప్పుడే, అది కల్యాణ ప్రదమై, ఆత్మోపలబ్ధి సాధన మగును. జ్ఞానము క్రియాశక్తి సమన్వితమైనప్పుడే, అది ఆత్మయొక్క నిండుదీప్తిని ప్రకాశింపజేయును.

— మల్యాద్రి కృష్ణారావు

జీవితం కొత్త అద్దం వంటిది. అద్దానికి మరకలైతే తుడిచేసినట్లే జీవితంలో కష్టాలొస్తే కడిగేసుకోవాలి.

అంతేగాని అద్దంలాంటి జీవితాన్ని పగులగొట్ట కూడదు.

— కొమ్మినేని ప్రసాదు

సేవ, త్యాగం వీటికిమించిన ధర్మం నాకు తెలియదు.

— సాధువాస్వాని

ధర్మము సకలభూతములకు ఆశ్రయము. ధర్మమంతటను నిండి యుండును, ధర్మము సర్వమునకును అధిపతి యగును. అందరును ధర్మము నాశ్రయించి తీరవలెను.

— సత్యసాయిబాబా

ఏ ప్రాణికిని హింస తలపెట్టకుండుట గొప్ప ధర్మము. లోకములో ధర్మము, కీర్తి మాత్రమే స్థిరమైనవి.

ధర్మమును నాశనము చేసిన సర్వమూ నశించును. ధర్మమును కాపాడిన సర్వము సురక్షితమగును.

ధర్మము యొక్క నిజస్వరూపము బహునిగూఢమైనది సుమా!

ధర్మము వంటి స్నేహితుడు మరొకడు లేడు.

దయకు మించిన ధర్మము వేరులేదు.

వేదశాస్త్రాలు చదివినవారు పండితులు కారు. ధర్మ మార్గమున నడచుకొనువారే పండితులు.

— 'సుభాషితములు' నుండి

దేహములు బుద్బుద ప్రతిమంబులు; పరువము పేన సదృశంబు; సంపదలు తటిచ్చంచలములు; అలంకారంబులు భిత్తి చిత్రంబులు; దారపుత్రాదులు శ్మశాన గమనులు గాని యా పయిని వచ్చువారుగాదు; ధర్మ మొక్కటియే తోడ వచ్చి తన్ను గాచునది.

— వీరేశలింగము

మానవ ధర్మ నిరూపణమంటే నిజంగా ప్రపంచ సమస్యా పరిష్కార మన్నమాట కాదూ? సకల విజ్ఞానములు, సమస్త కళలు, సర్వనీతి సారములు, అఖిల సాధనా ప్రణాళికలు, ఆర్థిక, ఐతిహాసిక, రాజ్యాంగ, సామాజిక వ్యవస్థా పర్యాలోచనలు ఈ మానవ ధర్మ నిరూపణమునకే బాటలు

తీయుటలేదా? మానవ ధర్మమంటే, వ్యష్టిగతంగా ఆత్మోప లబ్ధి, సమష్టి రూపంలో లోక కల్యాణం, తత్వరీత్యా విశ్వ లీలా విలాసము.

— మిట్నూరి కృష్ణారావు

కష్టపరిస్థితులలో నుండియు ధర్మమర్యాదలను ఉల్లం ఘించరాదు.

ధర్మమాచరించునప్పుడు దంభమును, ఔద్ధత్యమును చూపరాదు. దాంభికముగా చేయు ధర్మము చివరకు నిష్ఫ లమై పోవును.

— క్షేమేంద్రుడు

ధర్మానికి దీటైన మాట యితర భాషలలో లేదు. దానికిగల కొలది అర్థాల నైనను అధ్యయనం చేయడం అవ సరం.

ఒక వస్తువు స్వభావం దాని ధర్మం అవుతుంది. కాల్చ డం అగ్నిధర్మం. తడపడం నీటి ధర్మం. సమాజజీవిగా ఉండ డం మానవధర్మం.

ధర్మం హిందూ మతానికి సరియైన పదం

'ప్రపంచం ఉనికిని ధర్మం నిలబెడుతుంది'.

(భారతం)

ధర్మ నిర్వహణంద్వారా జీవిత పరమార్థం సిద్ధిస్తుంది.

తన జ్ఞానాన్ని పెంపొందించు కొనడం విద్యార్థి ధర్మం. జ్ఞాన బోధ దేశికుని ధర్మం. శక్తివంచన లేకుండ పనిచేయడం

కార్మికుని ధర్మం. మంది శ్రేయస్సుకు తన శక్తిని పూర్తిగా వినియోగించడం మానవుని ధర్మం.

ఒకని ధర్మం యెంత పవిత్రమైనదో మరొకరి ధర్మం కూడ అంత పవిత్రమైనదే. (భారతం)

— స్వామిదివ్యజ్ఞానానంద

త్యాగంలో వివేక మున్నది
త్యాగంలో ఔదార్య మున్నది
త్యాగంలో మానవత్వ మున్నది
త్యాగంలో ధర్మ మున్నది
త్యాగంలో దయ ఉన్నది
త్యాగంలో కీర్తి ఉన్నది

త్యాగం లేనిదే పరోపకారం లేదు
త్యాగం లేనిదే శాంతి లేదు
త్యాగం లేనిదే ధర్మం లేదు
త్యాగం చెయ్యడం నేర్చుకోండి

— బాలుర ప్రవర్తన నుండి

ధర్మాత్ముడు మనస్సును వశము నందుంచుకొను చున్నాడు. మంచిచెడ్డలు రెంటిని అతడు బాహ్యక్రీడగా భావించి నిస్సంగుడగు చున్నాడు. పక్షపాతమున కతడు దూరుడు. అతడే వస్తువును అపేక్షింపడు. మఱి దుఃఖితుడును గాడు. ఆతడు తనపయి సంపూర్ణ నిగ్రహము కలిగియుండును. సదా శాంత చిత్తుడుగ నుండును.

— జేమ్సు ఎలన్

ప్రేమ సామ్రాజ్యమందు స్వార్థ ద్వేషములుండ నేరవు. అది సుఖ శాంత్యానందముల కావాస స్థానము.

ప్రేమ రాజ్యములో నివసించువారు ప్రేమద్వారము ననే తమ సమస్తావసరములను తీర్చుకొనుచుందురు.

ఈ ప్రపంచమందలి సమస్త దుఃఖములకు, క్లేశములకు, కలహములకు స్వార్థమే కారణము అట్లే శాంత్యానందములకు ప్రేమయే కారణము.

ప్రేమరాజ్య నివాసులు ప్రాపంచిక బాహ్యపదార్థములు నాకాంక్షింపరు. అట్టి వ్యక్తులు సమస్త ప్రాపంచిక చింతలనుండియు విముక్తులయి సంపూర్ణ సుఖశాంతుల ననుభవింపగలరు.

మానవ జీవితంలో ప్రేమ సానుభూతులు వృద్ధినందు కొలదియు సుఖశాంతులు వర్ధిల్లగలవు.

— 'జీవనపథము' నుండి

సరియైన అవగాహనకు మూలాధారం సహానుభూతియే.
ప్రేమించు, ప్రేమించు, ప్రేమించు,
చివరకు శత్రువునూ ప్రేమించు
అతడు నిన్ను ముల్లులా ద్వేషించినా
నీవు గులాబీ పువ్వులా వికసించు
ప్రేమ పెరిగినపుడు వాంఛ నశిస్తుంది

తన హృదయాన్ని ప్రేమతో నింపుకొని సేవాకార్యం నిర్వర్తించే వాడు ధన్యుడు. అతని పని అందంగా, శాంతి

వంతంగా ఉంటుంది. ఎందుకంటే అది ప్రేమను అభివ్యక్తం చేస్తుంది.

ప్రేమయే ముక్తికి సాధనం. జీవితానికి తరణోపాయం ఈ ప్రపంచంలో అన్నిటికంటె ఉదాత్తమయినది ప్రేమ.

ప్రపంచమంతా జ్వాలామయంగా ఉంది. ఆ జ్వాలను ప్రేమ తప్ప మరే పదార్థం చల్లార్చగలదు?

ఏకమత్యం, ప్రేమను మించిన ఇంకో మతాన్ని నే నెరుగను.

విద్య, ప్రేమ– యీ రెండూ యాత్రికుని మార్గాన్ని కాంతి మయం చేసే నక్షత్రాలు

పాపం సుడిగాలి వంటిది
ప్రేమ ఆకర్షణ శక్తిని పోలినది
ప్రేమలేని జ్ఞానం శూన్యంతో సమానం
ప్రేమ ఉన్నప్పటికీ జీవితం సమగ్రం కాదు
ఈ రెండూ త్యాగంతో మేళవింపబడాలి
జీవితానికి కావలసిన గుణాలు
జ్ఞానం, ప్రేమ, త్యాగం

మతాలు జాతులు చాలా ఉన్నవి. కాని అన్నిటికున్నది ఒకే భాష. అది ప్రేమ.

ప్రేమ లేకుండా ఏ మానవుడు గాని వివేకాన్ని పొందలేడు.

ప్రేమ చాలా పవిత్రమైన శబ్దం. చాలామంది మోహాన్ని ప్రేమగా భ్రమిస్తారు.

మోహం గుడ్డిది. ప్రేమ వివేకంతో కూడుకొన్నది. మోహం వ్యక్తిగతమైనది.

ప్రేమ వ్యక్తిగతమైనది కాదు
మోహం సంతోషాన్ని ఆశిస్తుంది
ప్రేమ సేవ చేయాలనుకొంటుంది
పరమాత్ముని దర్శనానికి ప్రేమ
కిటికీవలె ఉపయోగపడుతుంది
నీలో ప్రేమ లేనప్పుడు నీవేమీ చేయజాలవు
ప్రేమను చూరగొనాలంటే నీవు వినయంగా ఉండాలి

— టి. ఎల్. వాస్వాని

జాలి ప్రేమ భావమును ప్రకటించును. జాలిలేని వానికి ప్రేమ శూన్యం.

— మహమ్మదు

ప్రేమయే పరమాత్మ స్వరూపం. ప్రేమచేతనే మనుష్యుడు బ్రతుకగలుగుచున్నాడు. ప్రేమ ప్రవాహంలో నిలిచిన వాళ్లకు ఇంక శత్రుత్వ మెవరితో? దుర్బలుల మనస్సంక్షోభము వారి నంటదు. మృత్యు భయమేమో వారికి తెలియదు.

ప్రతిజీవి తనకు సుఖమునే, మంచినే కోరుకుంటాడు. నిజమైన సుఖమును పొందుటకు, ప్రేమ ఒక్కటే జీసస చూపిన మార్గం. సుఖమనుభవించడ మంటే ప్రేమ నన్వేషించడమే. ప్రేమనే సర్వస్వంగా చేసుకొనుటకు ప్రతి వానికిని శక్తి కలదు — హాక్కున్నది. ఇదే పురుషోత్తముడైన ఏసు

క్రీస్తుచే లోకాని కందజేయబడ్డ ఉత్కృష్ట జీవితతత్వం - పర మేశ్వరుని సువార్త

— టాల్ స్టాయ్

ప్రేమగల తావున దైవ ముంటాడు. ప్రేమ దేనినీ కాదనదు. సర్వదా ప్రసాదిస్తూ ఉంటుంది. ప్రేమ ఎల్లప్పుడూ బాధపడుతూనే వుంటుంది. ఎన్నడూ అసహ్యించుకోదు. పగ పట్టదు. అందువలన ప్రేమకు పగతీర్చుకోవాలనే ప్రసక్తే ఉండదు.

ప్రేమ న్యాయాన్ని పెంచుతుంది
ప్రేమ దుర్బలులను సబలులుగా చేస్తుంది.

ప్రేమ తత్వం తపస్సు వలన అలవడుతుంది. ప్రేమ పూర్వకముగా సంపాదించినది శాశ్వతంగా నిలబడుతుంది.

— మహాత్మాగాంధి

ప్రేమ మృదువైన మొక్కవంటిది. దీనికి నిరంతరమైన శ్రద్ధ, పోషణ అవసరం.

ప్రేమ యనగా సకల భూతము లందును స్వార్థములేని ప్రియత అని అర్థము. స్వార్థము కొంచెమైనను కలదేని దానిని ప్రేమయనుటకు వీలు లేదు.

స్వార్థరహితమైన, నిర్మలమైన, ఫలకాంక్షా రహితమైన భావములతో సర్వభూతములలో వుండే పరమాత్మతత్వ ములో అనుభవించే ప్రేమయే సత్యప్రేమ.

ప్రేమ పరిమళించే పుష్పంనుంచి ఆవిర్భవించే పరిపక్వమైన పండు వంటిది. ప్రేమ శక్తి లేకుండా పరిపాలిస్తుంది. చట్టము లేకుండా బంధిస్తుంది. ఈ ప్రేమ తత్త్వాన్ని గుర్తించడం సామాన్యులకు సాధ్యంకాదు. అట్టి ప్రేమ కలిగిన వ్యక్తిని మాత్రమే మానవు డని చెప్పవచ్చు. ఇది లేని మానవుడు కేవల ఆకారమానవుడు మాత్రమే.

సూర్యోదయమైన తక్షణమే కమలములు వికసించు నట్లుగా పరిపూర్ణమైన ప్రేమతత్త్వము వికసించిన తక్షణమే హృదయ కమలము పరిమళ భరితమై వికసిస్తుంది. మంటలోని మిణుగురువలె, సూర్యునిలోని కిరణమువలె మానవునియందు నిరంతరం ఈ దివ్యమైన ప్రేమ సత్యమై ఉండినపుడు అది మానవత్వ మనిపించు కొంటుంది.

— సత్యసాయిబాబా

ఇతరులకు సుఖాన్ని, సంతోషాన్ని, ప్రేమను ప్రసాదించడమే అత్యంత ఆనందకరమైన విషయం. మన కవసరమైన దానిని యితరులకివ్వడమే పరమానందం. ఇతరులను మనం సంతోష పెట్టినప్పుడు దైవం సంతోషిస్తాడు.

ప్రేమ దైవం ప్రసాదించిన వరం. ప్రేమించుట కంటె దైవానుగ్రహం వేరుగా లేదు.

— జెంషెడ్ నౌషర్ వాంజీ

ప్రేమ అనేది బాహ్య విషయములపై ఆధారపడదు. అది హృదయానికి సంబంధించిన ఆంతరంగిక విషయము.

— సుభాషితములు నుండి

చమురు దీపానికి ప్రాణంపోస్తుంది. ప్రేమ జీవితానికి వెలుగు నిస్తుంది.

జీవితాన్ని యావత్తూ పొట్టుతీసేసి జల్లించి కాచి వడ పోస్తే ఆఖరుకు కంటికి కనిపించే అమృత బిందువు ప్రేమ. అందుకే కబీరు అంటాడు. 'ప్రేమలేని శరీరం శ్మశానంలోని శవంతో సమానం. కంచరి వాని తోలుతిత్తి ప్రాణం లేక పోయినా శ్వాస తీసుకుంటూనే వుంటుంది గదా' అని.

ప్రేయసి ప్రియుల నడుమ, భార్యాభర్తల నడుమ ఉండే అనురాగం పెనవేసుకొని ఉండే లక్షణమును ప్రేమ అనే మాటలో వర్ణిస్తుంటాం. అయితే యిది మాత్రమే ప్రేమకాదు. ఆత్మీయత అనెడి సప్తవర్ణముల హరివిల్లులో ఇది ఒక రంగు మాత్రమే. దీనికంటె కళ్లు జిగేలుమనిపించేవన్నో రంగులు ప్రేమలో చోటు చేసుకొని ఉన్నాయి ఒక్క రం గును మాత్రమే తిలకించి జనం ఒళ్లు మరచిపోతున్నారు. ప్రేమ వెదజల్లే అన్ని రంగులూ అర్థం చేసుకొని ఆస్వాదిస్తే ఆనందానికి అవధు లుండవు.

— మన్నవ గిరిధరరావు

ప్రేమ పూరితమైన హృదయంగల వారికే ప్రేమ స్వరూపుడైన పరమాత్ముని ద్వారాలు తెరచి వుంటాయి.

ప్రేమించి సేవించునది మాత్రమే ఘనమైన జీవితం.

ప్రార్థన, సమర్పణలతో కూడిన ఆంతరిక జీవితంలోనే దైవ సంబంధమైన ప్రేమయొక్క దివ్య సౌందర్యం ద్యోతక మవుతుంది.

ప్రేమలో భయముండదు. లోపరహితమైన ప్రేమ సకల భయాలను పారద్రోలుతుంది.

జీవిత మనగా బాహ్యంగాను, అంతర్గతంగాను ఉన్న రాక్షస శక్తులతో నిరంతర పోరాటమే. దీనిలో జయం పొందడానికి మనం అత్యంత మహిమాన్వితమైన భగవన్నామాన్ని ఆశ్రయించాలి.

విద్య ద్వారా మనిషి తన శక్తులను, హక్కులను తెలుసుకో గలుగుతాడు. దివ్యప్రేమ వీటిని స్వార్థరహితంగా ఎలా ఉపయోగించాలో నేర్పుతుంది. ప్రేమలేని విద్యావిధానం తాత్కాలిక ప్రయోజనాన్ని మాత్రమే కలిగిస్తుంది. దివ్యప్రేమ యొక్క ఫలితం నెమ్మదిగా లభించినప్పటికీ శాశ్వతమైనది.

అర్థరహితమైన మనుగడకంటె ప్రేమ బాష్పములతో ఆర్ద్రమైన జీవితం శ్రేష్ఠమైనది.

హిందూ మతానికి ప్రేమ హృదయం వంటిది. లోకంలో ప్రేమలేని మతమేదీ లేదు.

— నారాయణ స్వామి

ఎవరినైనా మనం ప్రేమించినప్పుడు అప్పుడు అది కష్టమైనదైనప్పటికీ ఆయనను సంతోష పెట్టేపనిని చేయాలనుకుంటాము. ప్రేమ చాల ఎక్కువగా నున్నప్పుడు స్వార్థాన్ని పూర్తిగా మరచిపోతాము.

తల్లి బిడ్డను ఎంతగానో ప్రేమిస్తుంది. తనకు సంభవించనున్న ఆపదను సహితం మరచిపోయి ఆపదలోనున్న బిడ్డను రక్షించడానికి ప్రయత్నిస్తుంది.

తమ దేశాన్ని అమితంగా ప్రేమించే వ్యక్తులు వీరోచిత కార్యాలను నెరవేరుస్తారు. తమ దేశానికి ఉపయోగం జరిగేలాగుంటే ఎంతటి బాధలనైనా సంతోషంగా భరిస్తారు.

అత్యంత ప్రేమతో తన జీవితాన్ని దైవానికి అర్పించుకొన్న భక్తునికి స్వార్థచింతన ఏమాత్రమూ ఉండదు. తన శరీరానికేదైన యిబ్బంది కలిగినా, కడకది చిత్రహింసకు గురియైనప్పటికీ అతడు తన మనసును తన ధ్యేయంపై నిలిపియుంచగలడు.

నీవొక స్నేహితుని నిజంగా ప్రేమించినప్పుడు నీ కష్టాన్ని, యిబ్బందిని లెక్కసేయక అతని అవసరాలను తీర్చడానికి సంతోషంగా సిద్ధపడతావు.

— యస్. జి. పియర్స్

సర్వజీవుల యెడ సమానముగా నుండవలసిన ప్రేమను కొందరి యెడ జూపిన పక్షపాతమేగాని సత్యము కాదు. తనను ఎవరు ప్రేమింతురో, ఆ ప్రేమను వారినే తీసికొనని య్యవలయును. తనను ప్రేమించు వారిని ప్రేమించుట లంచగొండితనమేగాని సత్యముకాదు. అట్టి ప్రేమ పరమునకు శత్రువు. కూలివానికి తగినంత కూలినే యిత్తుముగాని ప్రేమ కోసము కూలి యిచ్చుట లేదు. సర్వజీవులయందు సమానముగా చూపబడునదే ప్రేమ. సమానముగా లేని ప్రేమ బంధము.

— చిన్నమ్మ

## ఈ గ్రంథ సంకలనమునకు సాయపడిన సాధనములు

పుస్తకములు :

1. చారుచర్య : మహాకవి క్షేమేంద్రుడు
హిందీ వ్యాఖ్య — దేవదత్తశాస్త్రి
తెలుగు వ్యాఖ్య — పి. వి. రమణారెడ్డి

2. జన్మ తరించు చిన్నమ్మ పలుకులు
ప్రకాశకులు : శాంతి కుటీరం, రేపల్లె

3. జీవన పథము : జేమ్స్ ఎలన్
అనువాదం — తిపిర్నేని లక్ష్మీనారాయణ

4. జీసను సందేశము : టాల్‌స్టాయ్
అను. తల్లాప్రగడ ప్రకాశరాయడు

5. దివ్య జీవనము (Imitation of Christ)
— థామస్ ఎ. కెంపిస్
అను : దుగ్గిరాల బలరామకృష్ణయ్య

6. ధర్మమంజరి (మనుమార్గ ప్రదర్శిని)
— జటావల్లభుల పురుషోత్తం

7. ప్రేమ : స్వామి శివానంద సరస్వతి
అను. హంసానందస్వామి

8. బాలుర ప్రవర్తన (హిందీ మూలం)
అను. కిషన్‌లాల్

9. భర్తృహరి వైరాగ్య శతకము
సంపాదకుడు : పాతూరి నాగభూషణం

10. మహాత్ముల సుభాషితములు

సమ్మేళన, ప్రచురణ : మచ్చల లక్ష్మినారాయణగుప్త

11. శాంతి పథము (James Allen's Diary)

అను. దుగ్గిరాల బలరామకృష్ణయ్య

12. శ్రీ కృష్ణుని జీవిత చారిత్రము (ఉర్దూ)

— లాలాలజపతిరాయ్

అను. కొణకంచి చక్రధరరావు

13. శ్రీ మద్వాల్మీకి రామాయణము — అరణ్యకాండము

14. సఫల జీవనము : జేమ్స్ ఎలన్

అను. తిపిర్నేని లక్ష్మినారాయణ

15. సుందర పాండ్య విరచితా ఆర్యా

అను. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

16. సుభాషితములు (సంకలనము)

— మహీధర జగన్మోహనరావు

17. Daily Divine Digest

— Swami Ghidbhavanananda

18. Meher Vani

— Published by Avatar
Meherbaba Centre, Vijayawada

19. Premayoga

— Shree Champakbhai

20. What shall I do with my Life?

— F. G. Pearce

పత్రికలు :

1. గాంధీమార్గ్ (హిందీ)
2. గాంధీ మార్గం

3. గ్రంథాలయ సర్వస్వము
4. ప్రకృతి
5. మోక్షసాధని
6. ప్రౌఢ శిక్ష (హిందీ)
7. East and west Series
8. భారతీయ మార్గము
9. సనాతన సారధి

కరపత్రము :

1. భీష్ముని చరిత్రము

ప్రకాశకులు :

శ్రీ రామకృష్ణ సేవాసంఘము, పలాసా

# అనుక్రమణిక*

ఈ గ్రంథమునందలి ప్రవచనముల కర్తల అకారాది సూచి



---

* తెలుగు అంకెలు శీర్షికకు సంబంధించినవి. కుండలీకరణము లోని అంకెలు పుటలను తెలుపునవి.

# సర్వోత్తమ ప్రచురణలు

సంపాదకుడు

## పోతూరి నాగభూషణం

౧. భర్తృహరి నీతిశతకము
౨. " శృంగార శతకము
౩. " వైరాగ్య శతకము

సంస్కృత శ్లోకమునకు ఏనుగు లక్ష్మణకవి తెలుగు పద్యం, పద్యాలకు టీక, తాత్పర్యం, వ్యాఖ్యలతో వెలువరింపబడినది.

౪. భక్తియోగము : అశ్వినీ కుమారదత్తు బెంగాలీ రచనకు తెనుగు సేత
అనువాదకుడు : కౌతా శ్రీరామశాస్త్రి
౫. సఫలత : వడ్లమూడి వేంకటరత్నము
౬. జీవిత ధర్మము (సంకలనము)

ప్రతులకు


గ్రంథాలయ పుస్తకశాల
సర్వోత్తమ పురం
విజయవాడ — 520 006


108—13